ఇతర పుస్తకాలు :

| | | |
|---|---|---|
| కృష్ణవేణి | ... | 0—4—0 |
| శిక్ష | ... | 0—2—0 |
| పరిశోధన | ... | 0—2—0 |
| ప్రియురాలు | ... | 0—6—0 |

డిస్ట్రిబ్యూటర్లు :
**వినోద గ్రంథమాల, తెనాలి.**

మొదటిముద్రణ ఏప్రిల్ 1942

# గర్వభంగం

ఆరోజుల్ని నేనెలా మరచిపోగలను? సూర్యునితోపాటే మేలొ్కని, ఏవిధమైన సమస్యతోనూ బుర్ర చెడగొట్టుకోకుండా, బాధ్యత తెలియని స్థితిలో స్కూలుకి వెళ్ళివచ్చే ఆ సరదాలన్నింటినీ అనుభవించటమే అప్పటి నా దినచర్య.

నేను చాలా అందమైనదాన్నని స్కూల్లోనూ, మాఇరుగుపొరుగునా కూడా అనుకుంటూవుండేవాళ్ళు. క్లాసులో కూర్చున్నంతసేపూ కుర్రవాళ్ళ దృష్టి నాపైన ప్రత్యేకంగా కేంద్రీకరింపబడటం నాకు తెలుసు. దాదాపు అందరుమేష్టర్లూ ప్రత్యేకం ఇంగ్లీషు మేష్టరు ఏదో ఆశతో నావైపు దొంగచూపులు చూస్తూ పాఠంకూడా సరిగ్గా చెప్పకపోవటం నేను ఎరుగుదును. సాయంత్రం స్కూలునుంచి. ఇంటికి వచ్చేతోవలో ఎదురయ్యే పురుషులందరూ నన్ను పరీక్షగా చూడటం నాకు కొత్తకాదు. సాయంత్రం చల్లగాలిమేస్తూ మేడమీదికి వెళ్ళినప్పుడు గుంపులుగా కిందిరోడ్డుమీద పైదృష్టితోనడుస్తూ మామేడచుట్టూ తిరిగే సౌందర్యారాధకులే నాసౌందర్యాన్ని నాకూ, నన్ను తెలిసినవాళ్ళకూ వేయినోళ్ళ చాటుతున్నారు.

కాని ఇదంతా నాకు మహా చికాకుగా ఉండేది. నావైపు ఆశగా చూసే వాళ్ళందర్నీ ఉరి తియ్యాలనిపించేది. కాస్త అందమైన యువతిమీదనే తమదృక్కుల్ని వృధాగా ప్రయోగించేవాళ్ళ నీచత్వాన్ని అరికట్టించే ఉపాయం లేదా అనిపించేది. నాముందు తమశక్తినిరూపించి నాదయకు పాత్రులయ్యేందుకు వారు చేసే పనుల్ని చూస్తే ఒళ్లు మండేది.

కొందరు మేస్టార్ని ఏడిపించి తమ "విట్టు"ను నాకు వ్యక్తీక
రించాలని కుంటె, గుడ్డి ప్రశ్నలువేసి — దానికి ఘాటైన
సమాధానాలు రాగానే తెల్ల మొగాల్తో కూలబడే వాళ్లు;
ఇది చూస్తే నాకు నవ్వు ఆగేదికాదు.

ఇంతమంది మూర్ఖుల్ని చూసి ఒక్కొక్క సమయాన జాలి
పడేదాన్ని. కాని ఎదుటి వ్యక్తి సానుభూతిని అర్థం చేసుకో
లేకా, తమ స్థితిని గుర్తించుకొని, తమకు తామే జాలిచూపు
కొని, తమ ప్రవర్తనలో మార్పుకు ప్రయత్నించక పోవటం
వీరిలో ప్రబలిన సద్గుణమని తెలిశాక — వీళ్ళందర్నీ ఆడించి
ఏడిపించాలనిపించేది. నాకు ఏవేవో పేర్లుపెట్టి ఏడిపించాలని,
ఈలలు వేసుకుంటూ ద్వంద్వార్థాల్లో తమ పాండిత్యాన్ని
నాకు పరోక్షంలో ఉండి విన్పించాలని బయలుదేరిన వీళ్లను
చూస్తే— వీళ్ళతో పాటే చప్పట్లుకొట్టి, ఈలలువేస్తూ గోల
చేసి వాళ్లకన్న నాలుగాకులు ఎక్కువే చదివేనని నిరూపిం
చాలని ఉండేది; కాని ఆడదానికి ఎవ్వరూ ఇవ్వని, ఇవ్వలేని,
హక్కుతో ఎదురు తిరగలేని హృదయంతో లేని సిగ్గును
నటించుకుంటూ బలవంతాన కృత్రిమ వాతావరణానికి లొంగి
పోవటం క్రమంగా అలవాటైపోయింది.

కొంటెతనానికి ఏకుర్రాడి వేషయినా కాస్త కన్నెత్తి
ఆశను నటిస్తూ చూశానా— ఇంక వాడిగతి ఆ పరమాత్ము
డికే ఎరుక! నా పరోక్షంలో ఎన్ని బాధలు పడతాడో నాకు
తెలియదుగాని, నా సమక్షంలో మాత్రం వాడు వేసే
ఎత్తులూ, చూసే చూపులూ, చేసే చేతలూ, — నాకు మహా
ఆనందంగా ఉండేవి. అప్పుడప్పుడు నా చిరునవ్వు మంచి

ఇంజక్షనై పనిచేసేది! చిరునవ్వు విలువ లేనిది కనుక (నాదృష్టిలో) దాంతో ఇంత ఆనందాన్ని సంపాయించటం నాకు సరదా అయిపోయింది.

అద్దంలో నాప్రతిబింబాన్ని చూసుకుని, అనేకులు యీ సౌందర్యమూర్తికోసం జపాలు చేస్తూ చస్తున్నారని తలుచుకున్నప్పుడు — నా ఆనందం వేయిరెట్లయి కన్పించేది! ఈ అందని అందం కోసం చెయ్యి జాపుతూన్న సౌందర్యా రాధకులు లెక్కకు మిక్కుటంగా ఉన్నారన్న తలపు నాలోని గర్వాన్ని రెట్టించేది. సౌందర్యవతిగా జన్మించి ఇంతమంది ఆరాధకుల్ని సంపాయించ గలిగినందుకు చాల అదృష్టవంతురాల్నే! నా కంటి చూపుకే తహతహలాడేవాళ్ళు ఉన్నప్పుడు—నేను ఎంతమందికన్న గొప్పదాన్నో సులభంగా తెలిసిపోయింది......... ఐనా ఇంతమంది దృష్టి నామీద నిలపడం నాకు అప్పుడప్పుడు అసంతృప్తి కలిగించేది. పెద్దవాళ్ళతోనో, లేక హెడ్మాస్టరుతోనో చెప్పి యీ కోకిరాయి గాళ్ళకు బుద్ధి చెప్పించాలని పించేది. కాని ఇదేమంత గొప్ప విషయమని అందాకా పోనివ్వాలి? సిగ్గువిడిచి 'నన్ను ఇలా అంటున్నాడు; ఆలా అంటున్నాడు' అని ఎవరిమీదైనా రిపోర్టివ్వటంకూడా ఒకసమస్యేనాయె! అయినా ఈరకం జీవితం నాకు బాగా అలవాటైపోయింది. ఆ ఆనందాన్ని పాడుచేసుకోవటంకూడా నిజానికి నాకు ఇష్టంలేదు. ఆరాధకుల్ని వదిలించుకొని నేనుసాధించేది మాత్రం ఏమిటి? వాళ్ళలోలేని సంస్కారాన్ని నాలో ఉంచుకొన్నాక, నాకు కలిగే అపాయంకూడా లేదనిపించింది. అసలు వీళ్ళను ముప్ప

తిప్పలూ పెట్టి మూడు చెరువులనీళ్లు తాగించగల శక్తి నాలో ఉండగా ఇతరుల సహాయం మాత్రంనాకు దేనికి ?

# 2

కొత్త సంవత్సరంలో ఒక కొత్తకుర్రాడు మాక్లాసులో చేరాడు. అతను ఏప్రాంతంనుంచి వచ్చాడో కాని- యీకోతి మూకలో పడాల్సినవాడుమాత్రం కాదని అతన్ని చూసిన మొట్టమొదటిక్షణా న్నే అనుకున్నాను. ఉడుకుమించిన బలం అతని ఆరోగ్యశరీరంలోని అన్ని దిశలనుంచీ కన్పిస్తూనేవుంది. ఆస్ఫురద్రూపిని చూడటంలో నేను చెప్పలేని ఆనందాన్ని అనుభవించసాగాను.

అతని ముఖంలోకిచూస్తే 'అమాయకత్వం' అనే పదాని కున్న అర్థం వ్యక్తమౌతుంది. ఆజుట్టు ముఖంమీాదికి పడ్డా నిర్లక్ష్యంగా ఊరుకోవటం అతనికలవాటు. నవ్వుముఖంతో క్లాసులో గోలేమీా చెయ్యకుండా కూర్చోవటాన్ని ఎక్కడ నేర్చుకు వచ్చాడో? తన పెద్దకళ్ళకు చుట్టూ జరుగుతూన్న వెధవ వేషాల్ని చూడటం పనికాదని అతని ప్రవర్తన ఒక్క నాటిలోనే చెప్పింది. అంతమంది కొంటె వెధవల్లోనూ అతను ఒక్కడే నన్ను చూసీ చూడనట్టుపోవటం నాకు కొంచెం కష్టాన్ని కలిగించింది. అతనికి నిగ్రహం ఉండవచ్చు; కాని దాన్ని బలవంతాన నాముందు ప్రదర్శించేందుకు వ్యర్థప్రయ త్నం చేస్తూన్నట్టు నాకుతోచేది. సౌందర్యంముందు విధిగా తలలొంచాల్సిన పురుషుల్లో ఇతనుజమకాడేమోననిపించింది;

కాని నాముందు కూడా అంతేనా? నా మనోగర్వానికి అదొక చిన్న గాయాన్ని చేసినట్టు తరువాత తెలిసింది.

నాకు తోడుగా మాక్లాసులోవున్న మరిముగ్గురు విద్యార్థినులు, నా అంత సౌందర్యవతులు కాకపోవటంచేత, విద్యార్థులు తమదృష్టిని నామీదనే కేంద్రీకరించటం వారిని అసూయాపరులుగాగా చేసింది......

"ఎలాగైనా అందమైనదానివి; నీకు కాకపోతే మాకు ఇంతమంది వెంటబడతారుటలే—" అనేది ఒకతె.

"జయ చాల అదృష్టవంతురాలు; ఇంతమందిని ఆకర్షించటం మాటలేనా?" అనేది ఇంకొకతె.

"వాళ్లను ఏడిపించే నేర్పూ, కసి తీర్చుకునే చాకచక్యమూ జయలో ఉన్నాయ్!" అనేది వేరొకతె.

నా ఆనందమేమిటో కనిపెట్టినట్టు మాట్లాడే వీళ్ళు-ఆ కొత్తకుర్రాడు వచ్చిన పదిరోజులకల్లా తప్పనిసరిగా ప్లేట్లు మార్చారు.

"జయా! ఆ కొత్తగా వచ్చిన శివరావ్ మంచి అందగాడు—కదూ?" అన్నది ఒకతె. 'అందమంటే నీ వొక్కతెదే సొత్తుకాదుసుమా' అన్న ఎత్తిపొడుపును సూచిస్తూ.

"జయ ఆటలు అతనిముందు సాగవులే!" అన్నది రెండో ఆమె, నన్ను కవిస్తూన్నట్టు.

"ఆకుర్రాణ్ని ఆకర్షించటంలోనే తెలుస్తుంది—జయ చాకచక్యం" అన్నది మూడోఆమె, నన్ను కార్యరంగానికి దూకమని సూచిస్తూ. వీళ్ళ మాటలధోరణి నాకు తలకాయనొప్పిగావుంది. అతన్ని ఆకర్షించటమేనా నా ఉద్యోగం?

నాకేం అవసరం ?

కాని ఆరాత్రి చదువుకున్నాక తీరిగ్గా పడుకుని - సాయింత్రం సఖులన్న మాటల్ని జ్ఞాపకం చేసుకున్నాను. నిజానికి నా అందం ఆతనిముందు దమ్మిడీకికూడా మారటంలేదు. అందరిలాంకాకుండా తప్పుకు తిరుగుతాడు. అతన్నికూడా కొంటెతనంతో ఆకర్షించి నాచుట్టూ తిప్పించుకోవటంలో ఎంత ఆనందమూ, తృప్తీ వుంటుంది! నా ఆటలేవీ ఈ ప్రవరుడిముందు సాగవని సఖులన్న మాటలు తప్పుగా వేలుపెట్టి చూపిననాడు, వారి ముఖభంగిమలు ఎలా వుంటై ? అతను మహా అందగాడట ! కావచ్చు - అందుకు నేనేం చేసేది ? ఐనా అతను ఎంత అందగాడైనా సరిగ్గా నేను తల్చుకుంటే మూడోనాటికల్లా ఈ మేడకింది రోడ్డుమీద దొర్లేట్టు చెయ్యనూ ? దిక్కు-మొఖంతో, ఆశగా చూసుకుంటూ బెదురుగా అతను యీ రోడ్ల వెంట తిరగటాన్ని ఊహించుకుని నవ్వుకున్నాను ! నిజంగా ఇదంతా చేస్తేమాత్రం ప్రమాదమేముందీ ? కుక్కల్లాగ నాచుట్టూ తిరుగుతూన్న వాళ్ళల్లో అతనూ ఒకడేననీ, సామాన్య మానవుడిలోవున్న వాంఛలు చావవనీ నా సఖులకు చూపి అతని అందానికి గర్వభంగంచేస్తే ఎంతతృప్తి ! నా అందానికిఎదురైన యీ చిన్న పరీక్షలో ఉత్తీర్ణురాలినవటం ఏమంత గొప్పవిషయం కాదని-నాకు నేనుగానూ, నా సఖులకూ ఒక్కసారే వ్యక్తపరుస్తే ఎంత బాగుంటుందీ ! ఇదంతా జరిగేదాకా రెండో చెవిని వెయ్యకూడదనీ, మర్నాటి నుంచే కార్యరంగంలోకి దిగి-అతను మేడచుట్టూ ప్రదక్షిణాలు చేస్తూండగా నా సఖు

లకు చూపి-వారితోపాటే తృప్తికరంగా కిలకిలా నవ్వాలనే నిశ్చయానికి వచ్చాను.

## 3

మర్నాడు స్కూల్లో అతను నా దారికి ఎదురవగానే- అతని కోసం బాధపడుతున్నట్టుగా ఒళ్లు తిప్పుకొని- అంతవరకూ ఏ పురుషుడికీ చూపని నామధురమైన చిరునవ్వును ప్రదర్శించాను. అతను కనుబొమల్ని చిట్లించి చూసీచూడనట్టుగా తనదారిని వెళ్ళిపోయ్యాడు. అతని నిర్లక్ష్యత నాకు ఒళ్లు మండించి, నాపట్టుదలను రెండింతలుగా చేసింది. అతన్ని ఆకర్షించ లేకపోతే నేనెందుకూ పనికిరానివనుకున్నాను.

ఆరోజుల్లో అతను నావైపు చూసినప్పుడల్లా- ధైర్యంచేసి పురుషుణ్ణి ఆకర్షించేందుకు స్త్రీ పడేచే అస్త్రాలన్నింటినీ విడుస్తూనే ఉన్నాను. కాని అతనిలోమాత్రం నేను చూడదగినంత చలనం కల్పించలేదు. నాశక్తిమీద నాకే కొద్ది అధైర్యం కలిగింది. కాని అతనిమీద నాకు వచ్చిన కోపమంతా నన్ను ఈ సమస్యా పరిష్కారంలో ఇంకా ముందుకు సాగమని ప్రోత్సహించింది.

సాయంత్రం ఇలాటి ఆలోచనల్లోనే ఇంటికివచ్చాను. మామూలుగా, మేడమీదకు వెళ్ళిన అరగంటకల్లా ఆ రోడ్డు వెంట నాకోసం పడిచేవాళ్ళల్లో అతనుకూడా ఒకడయ్యాడని తెలిసేప్పటికి- నా అందం యొక్క విలువ అర్థమైంది. ఎంత మొండికేసినా చివరకు నాపాదాలముందు మోకరింపజేసే

నాశక్తి ఇతనిదగ్గరమాత్రం ఎందుకు వృధా అవుతుంది? గర్వంతో కూడిన సంతోషంతో నాహృదయం నిండిపోయింది.

అతను రెండు మూడుసార్లు అటూ, ఇటూ పైకిచూస్తూ తిరిగాడు. నేను నవ్వి అతన్ని మరీ కవించాను. నా నవ్వుకు అతను నవ్వుపూర్వకంగా జవాబైతే ఇవ్వలేదు కాని, చూపుల్లో తన ఆశనంతట్నీ ఇముడ్చుతున్నట్టు నాకు తోచింది. మామూలు పురుషుడికన్న నిర్లక్ష్యత కొంచెం ఎక్కువ మోతాదులో అతనిలో ఉందని తెలిసిన నాకు — ఇంతతో వదుత్తే అతను నిరాశపడి తిరిగి సరైన ప్రదక్షిణాలు చేస్తాడో మానుతాడో అనే అనుమానం వచ్చింది. వెంటనే మేడదిగి మెల్లిగా దొడ్డిగుమ్మందగ్గరకు వెళ్ళి నిలబడ్డాను. అతనుకూడా దారి మార్చి ఆవైపు రా సాగాడు.

కుర్రాళ్ళందరూ ఇంతవరకు తమ డ్యూటీని నిర్వర్తించి, మామూలు నిట్టూర్పులతో, మరొక సాయంత్రం తమ విఫల యత్నంతో గడిచిపోయిందని తెలుసుకుంటూ కొంపలు జేరారు. సూర్యాస్తమయమైనా ఇంకా కొద్ది వెలుగు భూమాతను ఆవరించుకు కూర్చుంది. ఆ వీధిని జనసంచారం లేకపోవటంకూడా నా ధైర్యాన్ని ప్రోత్సహించింది.

అతను నాదగ్గరకు వస్తూనే 'ఏం?' అన్నట్టు కనుబొమల్ని ఎగరేశాడు. అతన్ని ఇంత సమీపంలో ఇదివరకు నేను చూడలేదు. నిజంగా చాల అందమైనవాడు! అతని కళ్ళల్లోని వెలుగు సహజంగా ఎక్కువమంది స్త్రీలను ఆకర్షిస్తుందనేందుకు సందేహం లేదు. అతనిచూపులో ఎంతో పరిచయం స్ఫురిస్తోంది. అమాయకంగా అతన్నిచూస్తూ నిలబడి పొయ్యాను.

నాకు రెండుగజాల దూరంలో నిలబడి, అటూ ఇటూ కూడా చూడకుండానే, "ఎప్పుడురాను?" అన్నాడు.

నాకు ఒళ్లు మండింది. ఇంత ధైర్యంచేసి నాలాటికన్యతో మాట్లాడగలిగే కుర్రాడు మా హైస్కూలు మొత్తంమీదనే లేడు! మా ఇంటిదగ్గర-నున్న-ముందువెనుకలు ఆలోచించకుండానే ఇంత ప్రశ్న వేశాడంటే ఆశ్చర్యమే అయింది! అసలు అతన్ని బొట్టూ కాటికాపెట్టి పిలిచిందెవరు? నేనేదో అపరాధంచేసి తనకు లొంగినట్టుగా మాట్లాడాడు! బహుశా అది నా ఆకర్షణలోని ఆశా జ్యోతి అయివుంటుంది; కాని నాకు ఇదెంత అవమానం!

అతనికి సమాధానం చెప్పేందుకు కొన్నిక్షణాల ఆలోచన సాగింది. ఇంత జబర్దస్తీగా ప్రవర్తించిన ఇతనికి మంచి శిక్ష విధించాలనుకున్నాను. చూసి నవ్వినంతమాత్రాన నాలాటి ఏ గౌరవ కుటుంబానికి చెందిన స్త్రీ వెంటా పడకుండా ఉండేట్టు—రెండో వ్యక్తికి తెలియకుండా, ముప్పతిప్పలూపెట్టి మొత్తని చెప్పుతో కొట్టినట్టు చెయ్యాలనిపించింది. తను అందగాడనీ, నాలాంటి వాళ్ళను ఆకర్షించగలిగాననీ అనుకుంటున్నాడు కాబోలు! నేను ఇంకా కొంచెం కొంటెగా ప్రవర్తిస్తేనేగాని అతనికి తగిన గుణపాఠాన్ని బోధించలేను!

అన్నాను: "రాత్రి పన్నెండింటికి—"

ఇంకేమీ మాట్లాడకుండానే అతను వెళ్లిపొయ్యాడు. ఎక్కడికి రమ్మన్నానని అర్థం తీసుకొని ఉంటాడు? అసలు నా సమాధానానికి నా ఎదుటనే సంతోషంతో ఎగిరి గంతే

స్తాడనుకున్నాను. చాలా మామూలు ధోరణినే వ్యక్తపరి చాను. 'నిగ్రహం' అనేదికూడా ఒక్కొక్కసమయాన బైట పడుతూంటుంది కాబోలు! కాస్త ఆలోచించాక ఇదంత గొప్ప విషయంగా తోచలేదు. ఎందుకంటే-నిజంగా వచ్చే వాడు. రాదల్చుకున్నవాడు-"ఎక్కడికిరాను? మీ వాళ్ళుం డరా? ఎల్గారాను? సదుపాయాలేంటి?" వగైరా ప్రశ్నల్ని వేసేవాడు. అతని మోహం-ఎక్కడికని వస్తాడు? ఎన్ని గుండెల్తో అతను కులీనుల ఇంటిచుట్టూ అర్ధరాత్రి గస్తీతిరుగు తాడు? ఒకవేళ తెల్లారేదాకా, ఆమంచులో నక్షత్రాలు మాత్రమే తోడుగా ... గారం చేసినా - దాసీదివచ్చి అతని ముఖాన పేడనీళ్ళు చల్లాల్సిందే కాని, మరెవ్వరూ అతని కంటపడరని నాకు గ్యారంటీగా తెలుసు. నిజంగా నాపత కమే పారినట్టయితే - ఇతరకుర్రాళ్ళకు ఒక్క పగటిపనీ, ఇత నికిమాత్రం ప్రత్యేకంగా పగలూ రాత్రీ కూడా పని కల్పిం చినదాన్నవుతాను. మొదట నిర్లక్ష్యంగానూ తరువాత జబర్ దస్తీగానూ ప్రవర్తించినందుకు బలేశిక్షలు! అట్లా అయి తేనేగాని పునాదికదిలి, ఇకముందు రోమాన్సు మాటైనా తలపెట్టకుండా, ఇలాటి వ్యవహారాల్లోకి దిగడు! నిజంగా నా తెలివితేటలకు నేనే గర్వపడ్డాను. ఇతరుల సహాయాన్ని అపేక్షించి మాత్రం ఇంతకన్న విధించే శిక్ష ఉండదు. రేపు ఇదంతా సఖులతో చెప్తే-వాళ్ళేకాదు - ఐదేళ్ల కుర్రాడిదగ్గ ర్నుంచీ అతని చెవులకు తాటాకులుకట్టి గోలచెయ్యరూ? బలేపని!

# 4

జోరున వర్షం కురుస్తోంది. అసలే చీకటిరాత్రికి మబ్బులు కూడా తోడై భయంకరమైన కటికిచీకటిగా చేసింది. ఆ ఉరుములూ — మెరుపులూ — వాటినిగురించి ఆలోచించేవాళ్ళకు వింత వింత అభిప్రాయాల్ని ఇస్తున్నాయ్. రివ్వున వీచే చలిగాలి పై రెక్కలుమాత్రమే తెరిచివున్న కిటికీచువ్వల్ని శబ్దంతో తోసుకొచ్చి గదిలోని వాతావరణాన్ని చల్లగా మార్చేస్తోంది. నా చదువుకుగాను ప్రత్యేకింపబడ్డ మేడమీది గదిలో పడుకుని-గొంతువరకూ వెచ్చని రగ్గు కప్పుకుని—ఒక చేతిలోఉన్న పుస్తకాన్ని చదవసాగాను. ఆ వాతావరణానికి హృదయవేదనల్ని కడిగేసే శక్తి ఉన్నట్టుగా తోచింది. చదువు మధ్యలో ఒకటి రెండుసార్లు అతని సంగతి జ్ఞాపకం వచ్చింది. కాని ప్రాముఖ్యత వహించకుండానే నన్ను నవ్వించి ఊరుకుంది.

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. ఏదో చల్లనివస్తువు నా చెంపల్ని తాకేదాకా తెలివి రాలేదు. ఒక్కసారిగా ఉలిక్కిపడి దెయ్యమో, భూతమో ననుకుంటూ తుళ్ళిపడి కళ్లు తెరచాను. ఎదుట తడిబట్టల్తో అతను నిలబడి ఉన్నాడు. భయము, ఆశ్చర్యము నన్ను ఆవరించినయ్. ఏం చెయ్యాలో తోచలేదు. ఇంకొక సహాయంకోసం కేక వేద్దామనుకున్నాను; కాని నోరాడలేదు. అతని కళ్ళల్లోకి చూసేటప్పటికి నాలో మేలొన్న శక్తులు వెనుకంజ వేయసాగాయి.

"మంచి మర్యాదస్తురాలివి! రమ్మని పడి నిద్రపోవటం

నేర్చుకుంటే ఎట్లా?" ఆ కంఠంలో చలనం యేమీ లేదు. కాస్త బైటికి వెళ్తే చలిలో ఒణుకుతూ మాట్లాడాల్సి వస్తుంది కాని, అతనిలో ఆ వాతావరణం మార్పును తేలేక పోయింది.

నేను రమ్మన్నానే కాని నిజంగా వస్తాడని స్వప్నంలోకూడా అనుకో లేదు. ఈ భయంకరమైన చీకటినీ, మానవుడు సహించ లేనంత చలినీకూడా లెక్కచెయ్యకుండా ఓపిగ్గా నా కోసం వచ్చాడు! నన్ను నేను కొన్ని క్షణాలవరకూ గుర్తించ లేక పోయ్యాను.

నాకు ఎదురుగాఉన్న 'బిగ్ బెన్' టిక్ టిక్ మంటూ రాత్రి ఒంటిగంట అవుతోందని చెప్తోంది. ఈ అర్థరాత్రి మేడమీద ఒంటరిగా నిద్రిస్తూన్న నాగదిలోకి ప్రవేశించాడు! దొంగ లంటే ఎరుగని నేను — యీదొంగను చూశాక — వారు ఎంత భయాన్ని మనకోసం మూటకట్టుటకు వస్తారో తెలి సింది! ఒక్కసారిగా లేచి కూర్చున్నాను. రాత్రి చదువు తూండగానే రొమ్ములు మీదపడి నిద్రిస్తూన్న పుస్తకం కింద పడింది; ఎలక్ట్రిక్ లైటుమాత్రం 'నన్ను ఆర్పితే నీకేం వస్తుంది?' అన్నట్టు రాత్రినుంచీ భీష్మించుకు కూర్చుంది.

ఏదో కొంటెతనానికని చేసింది - ఎంత ప్రమాదమైంది! పురుషునిగాలి ఎరుగని నాగదిలోకి మొట్టమొదటి మగవాడై ప్రవేశించిన ఇతన్ని ఎవరైనా చూస్తే - నాకులీనతకూ, గౌర వానికీ, కన్యాత్వానికీ తీరనికళంకం ఏర్పడదూ? వెంటనే వెళ్ళి పొమ్మని ఆజ్ఞాపిద్దామనిపించింది. ఒక్కసారి అతనిపైపు చూశాను. పైనుంచి కిందిదాకా నీరు కారుతూన్న శరీరాన్ని

కూడా లెక్క చెయ్యకుండా — నవ్వుతున్నాడు — ఆ నవ్వే నన్నింతదూరమూ లాక్కొచ్చింది; ఇంకెంతదూరం తీసుకెళ్తుందో? నాగదినంతట్నీ స్నానం చేయిస్తాడాయేం?

చిన్న జల్లుకుకూడా గొడుగులేందే బైటికి రాలేనని దద్దమ్మల్లో ఒకడేమోనని భ్రమపడ్డాను. ఎంత ఆశతో నాకోసం ఇంతదూరం వచ్చాడు! నేనొక్కతెనే ఇక్కడుంటానని అతనికెల్లా తెలుసు? కింద ఫారాయిచ్చే రహీమూ, పరాయిమనిషి రక్తాన్ని చవిచూసేందుకు ఉవ్విళ్ళూరే జానీకుక్కా ఇతన్ని ఎలావదిలేరు? మెట్లగదిలో నాన్న గుర్రుపెట్టి నిద్రపోతూండగా ఇతను అక్కణ్నుంచి వచ్చివుంటాడంటే ఎట్లా నమ్మను? ఆకాశంమీంచి ఊడిపడలేదుకదా? గ్రీసుకథల్లో చదివే కీలుగుర్రపు కథానాయకుడు గుర్తొచ్చాడు!

సిగ్గుతో కుంగిపోతూ అతని ఎదుట నిలబడి ఒణుకుతూన్న కంఠంతో మెల్లిగా అన్నాను: “నన్ను క్షమించి ... వెళ్లిపోండి—”

“వెళ్ళేవాణ్ణి ఎందుకు వస్తాననుకున్నావ్? కాస్తతలుపు గడియవేసుకుని నిద్రపోవటమైనా నేర్చుకోకపోతే ఏరాత్రో నాబోటివాడెవడో నిన్ను అమాంతంగా మంచంతోసహా ఎత్తుకుపోగలడు! కింద మీకుక్క నాపంచలో సగభాగాన్ని పొట్టను పెట్టుకుంది; దానికి ఇంత అన్నం వెయ్యటమూ, అతిథుల్ని సత్కరించటమూ నేర్పు. రమ్మన్నదానివి నిచ్చెనయినా వేశావా? పంపుగొట్టాంమీంచి పాకిరావాల్సివచ్చింది.” నవ్వుతున్నాడు!

నిజమా? ప్రేమ పేరుతో కబుర్లుచెప్పే ప్రియుడుకాడు!

నిజమైన అగ్నిపరీక్షలో ఉత్తీర్ణుడై ప్రాణాల్నికూడా లెక్క-
చెయ్యకుండా నాకోసమైవచ్చాడు! ప్రియురాలు గదిలోకి
ఆమె అంతట ఆమేవచ్చి, "నేను నీకోసం వచ్చాను. నన్ను
అనుభవించి, మీరు ఆనందించండి" అని చెయ్యిపట్టుకునే
దాకా, ఊపిరికూడా సరిగ్గా పీల్చని దద్దమ్మలు, సిగ్గుపేరుతో
చీదరతలను వంచి స్త్రీ చేత ప్రేమింపబడాలనే మూర్ఖులూ-
ఇతన్ని ఆదర్శంగా తీసుకోరాదా అనిపించింది!

ఒక్క-మాటతో ఇంతక్రియజరుగుతూంటే కాని- మాటల
విలువ తెలియదు! నా కన్యాత్వమూ, అపరిచితుడికి అర్ధ
రాత్రివేళ ఆశ్రయమివ్వటమూ మొదలైన విషయాలు జ్ఞాప
కం వస్తూంటే అంతులేని దుఃఖం పొంగి పొరలుతోంది. కాని
అతనివైపుచూస్తే- 'నాకష్టానికి ప్రతిఫలం!' అని దబాయిణ్ణో
అడుగుతూన్నట్టుంది. నాకోసం, ఇంత త్యాగంచేసినవాంచి
నోరారా ఎలా పొమ్మనగలను? విశాలమైన అతని ఫాల
భాగంమీద తడిసిన జుట్టు నాట్యం చేస్తూండగా- అతను
విగ్రహంలాగ నాముందు నిలబడివుంటే, ఏమీ చేతకానివాని
లాగు చూస్తూ ఊరుకోవటమేనా నేను చెయ్యగలిగింది?

తుండుగుడ్డ అందిచ్చి, "ముందు ఒళ్లు తుడుచుకోండి," అన్నాను.

అతన్ని చూస్తూంటే హృదయం భరించలేనంత సంతో
షంతో నిండిపోయింది. నాలాటి యువతి జీవితానికి ప్రత్యే
కపు ఆనందాన్నిచ్చేందుకు ఒక యువకుడు చాల అవసరమని
పిస్తోంది. కాని నేను కోరగలవాడు యీక్షణంవరకూ నాకు
ఎదురవలేదు. మొరిగేకుక్క కరవదన్నట్టు ప్రదక్షిణాలుచేసి,

ఈలలు వేసి, గోదురుకప్పల్లాగు నోళ్ళు తెరిచి గార్దభస్వరాల్తో పాటలుపాడే వెధవాయిల మధ్యనుంచి యీ నాగా చిన్న నాయకుణ్ణి ఏరుకోవటంలో నా బుద్ధికుశలత తప్పుదారిని నడవలేదు! నిండుకుండలాగు తొణకకుండా కార్యసాఫల్యతకు ఎంత నిశ్శబ్దంగా ప్రయత్నించాడు! ఇంత సాహసంగల ఆదర్శప్రియుడు దొరుకుతాడనుకోలేదు!

నాన్న ఇస్త్రీ పంచను తీసి అందిస్తూ, "ఇది కట్టుకోండి" అన్నాను; అతిథి సత్కారాన్ని నాకెవరో చెవిలో చెప్తున్నట్టుగా తోచింది...

ఎంత స్ఫురద్రూపి! నా స్నేహితురాళ్ళు నన్ను సరైన మనిషి వేపుకే కవించారు! ఎవరైనా చూసి ఏమంటారేమో ననే భయం నాలో లేకపోలేదు....కాని నాకోసం ఇంత త్యాగం చేసిన వ్యక్తికోసం ఆ కాస్త భయాన్ని పోగొట్టుకోక తప్పిందికాదు. శీలానికోసం పాకులాడే వాళ్ళల్లో అనుకోకుండా, ఇతర్ల కళ్ళుపడేందుకు వీల్లేని, ఇతర అపాయాలు పాలుకాని-ఇలాంటి స్థలాల్లో ఇంత అందమైనవాడు కన్పిస్తే ఎవరు విడిచిపెడతారో ననిపిస్తోంది. అతన్ని చూస్తూంటే ఇదివరకు నేను ఎరుగని కోర్కెలు గుంపులు గుంపులుగా నాలో పనిచేస్తున్నై. నాయవ్వనము, నిగ్రహంతో బలవంతాన తొక్కిపెట్టుకున్న వాంఛలూ తిరగబడుతున్నయ్. శీలానికి యీ రాత్రి రక్షరేకుగా నిలబడతానని ప్రబల వాగ్దానాన్ని ఇస్తోంది.

నాన్న చొక్కాకూడా అతని శరీరం మీదికి వెళ్ళింది. ఎక్కువైన చేతుల్ని నాకు చూపుతూ నవ్వాడు; నేనూ

నవ్వాను - ఏ అవస్థా పడకుండానే ఆనందం దానంతట అది ఎంత అదృష్టవంతులకైనా ఒళ్ళో పడదనిపిస్తోంది.

నిజానికి ఒక అపరిచితుడుతో ఒక రాత్రిని ఒకటే గది లోనే గడపటం ఆశ్చర్యమే! కాని నేను అనుకుంటాను— వివాహితలు శోభనం నాటిరాత్రి ఇదివరకు తాము ఎరుగని భర్తలనే అపరిచిత ప్రియులతో రాత్రి సౌఖ్యాన్ని అనుభ వించటానికీ, దీనికీ ఏమీ భేదం లేదని! అయాచిత ఆనందం ఇంకా కొద్ది క్షణాల్లోనే వస్తోందని తోచినప్పుడు — ఆశ ఒక పెద్ద కెరటం లాగు ఎగురుతోంది.

పొడిబట్టల్ని ధరించటం పూర్తయాక నావైపు ప్రశ్నా ర్థకంగా చూసాడు. అతను తన శపథాన్ని తీర్చుకున్నాడు; ఇక నావంతే మిగిలింది... "నీకేమీ భయం లేదు" అని చెప్ప లేక గది తలుపు గడివెయ్యటంతో సూచించాను.

తన చల్లని చేతిని నా మెడచుట్టూ వేశాడు. నేను సిగ్గుతో కుంగిపొయ్యాను — నాయవ్వనం మీద కావాలని ఇతరుడికి అధికారాన్ని ఇస్తున్నాను.

"ఎంత చల్లగా వుందీ!" అన్నాను.

"అవును. పదింటికల్లా ఆవలంతల్లో, చదువుతూన్న పుస్త కాన్నీ, వెలుగుతూన్న లైటునూ, దగ్గరగా వేసివున్న గది తలుపునూకూడా మరచిపోయి, వెచ్చని రగ్గులో శరీరానికి కృత్రిమ ఉష్ణాన్ని ఇచ్చుకుంటూ — ఉల్లాసంగా, ఏమీ కష్ట పడకుండా, కాళ్ళ దగ్గరకు వచ్చిన ప్రియునిలోని లోపాన్ని కనిపెట్టటంలో వింతేముందీ?" చాలా సిగ్గుపడ్డాను. కష్టపడ్డ వ్యక్తి ఫలితాన్ని అనుభవించబోతున్నాను కాబోలు!

పురుషస్పర్శలో ప్రప్రథమాన స్త్రీ అనుభవించే మాధుర్యం తెలుస్తోంది.

"ఎందుకూ అలాచూస్తావ్ ?" అన్నాను, నాశక్తుల్ని కట్టేసి నన్ను, నాలాటి గడుసుదాన్ని చేతుల్లో ఇరికించుకోగలిగిన తను !

"ఇక్కడికి ఏలావచ్చారు ?" అన్నాను.

"నాకు కాళ్ళులేవూ ? నేను మగవాణ్ని కాదూ ?"

అవును. ఈ మాటను నిజంగా అనగలిగిన మగవాళ్ళెంత మంది ఉన్నారు ? కాస్త చీకట్లో బ్యాటరీలైటులేందే బైటికి వెళ్ళేందుకు భయపడేరకం మనుషుల్లో ఇతను నాకు లభించటం చాల అదృష్టం !

"ఇక్కడ ఉంటానని ఎవరుచెప్పారు ?" అన్నాను, ఎలా రాగలిగాడా అన్న ఆశ్చర్యం నన్నింకా వదలక.

"ఎవరుచెప్పాలి ? వారంరోజుల్నుంచి ప్రతిరాత్రీ ఇటు వెళ్తూంటే- రెండు గంటలకైనా లైటు ఆర్పకుండా నీలాటి సోమరిపిల్ల గదిలోకాకపోతే ఇంకొకరిగదిలో ఎలావుంటుంది? ఆ మునిసిపాలిటీవాళ్లకు లైట్లుఖర్చుకింద నువ్వు ఎందుకూ అంతడబ్బు చెల్లించటం ?" నవ్వాడు; నా తెలివి తక్కువల్ని వేలెత్తి చూపుతున్నా నాకు ఆనందమే అయింది. నా ఉష్ణ శరీరం అప్పటికే అతని శీతల శరీరానికి కొంతవరకూ తన పోలికల్ని ఇస్తోంది.

ఒక మొండిగోడను పరీక్షగా అడ్డంపెడితే నూటికి నూరు మంది, ప్రియులనే పేరు చెలాయించుకునే ధీరులు పప్పులో కాలువేస్తారు; ఇంతపెద్దమేడను ఎగబాకివచ్చాడు ! దొంగ

తనంలో అందేవేసిన చెయ్యిఅయినా ఇంత ధైర్యంగా ప్రవర్తి
స్తాడనుకోను! అనుకుంటాను - ధనధాన్య చౌర్యాలకన్న,
యావ్వనపు చౌర్యం మానవుడికి గొప్ప విషయ పరీక్షతో
ఎదురౌతుందని.

మూడేళ్ళు ఎవరికీ అందకుండా దాచుకు కూర్చున్న నా
పెదవుల్ని మొట్టమొదటి సారిగా ముద్దాడాడు...ఆ అనుభవం
నేను ఊహించలేనంత ఆనందానికి దారితీసింది. నా కన్యా
త్వాన్ని నలినపరిచేందుకు వచ్చిన వ్యక్తిని ఎలాగౌరవిం
చాలో నాకు తెలియదు; కాని అతను అవన్నీ నేర్చుకునే
వచ్చాడనుకుంటాను.

అతని కళ్ళను చూసి లొంగకుండా ఎలాపోట్లాడగలను?
అతని బాహువుల్లో చిక్కుకున్నాక — నాబలాన్ని ఉప
యోగించుకుని, ఇవతల పడిమాత్రం నేను సాధించేదేమిటి?
ఇలాటి యువకుల్ని గెల్చుకోలేక ఇదివరకు వృథాచేసుకొన్న
రాత్రుల సంఖ్య జ్ఞాపకం వస్తోంది. బైట ఉరుములు పరాకు
తెల్పుతున్నాయ్. నా శరీరంమీద సర్వాధికారాన్ని యీరాత్రి
సంపాదించుకున్న అతను అన్నాడు. "చిన్న ఓణీల చాటున నీ
యవ్వనాన్ని ఇంకెన్నాళ్ళు దాచుకుంటావ్?"

ఎంతరసికుడు! ప్రకృతి శక్తుల్ని పట్టుబలవంతాన కృత్రిమ
మార్గాల్లో దాచుకునేందుకు ప్రయత్నిస్తూన్న నా మౌఢ్యా
నికి జాలి చూపుతున్నాడు! నాలాటి యువతి రహస్యాల్ని
తను ఎరిగినట్టుగా ప్రవర్తించటంలో గల హేళనను సూచిస్తు
న్నాడు... పదహారు సంవత్సరాలు వచ్చినా, ఇంకా చిన్న
పిల్లలాగు ఓణీలు వేసే కాలం గడపాలనే నా కుతూహల

మంతా అతని మాటల్లో మాయమైంది. నానాయకుడికి తగ్గ నాయికివి ఒక్కసారిగా అయి తీరాలనే అభిలాష గాఢంగా పనిచేసింది! నా స్త్రీత్వమంతా ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చింది.

"ఇంకా సిగ్గుపడుతూ, భయపడుతూ, తెల్లారేదాకా నన్ను ఊరించి, తెల్లారాక మెల్లిగా సాగనంపుతావా?" అన్నాడు.

కోర్కెయొక్క శక్తిని తెలిపాడు. అందమైన దాన్నే కాబోలు! ఐనా అడిగాను: "మీకు బాగున్నానా?" నవ్వాడు; నా అమాయకత్వానికి సానుభూతిగానేమో?

"ఎంత బాగుండకపోతే - యీ రాత్రి నన్ను వానలో, మేడలు దూకించగలుగుతావు?" ఎంతగర్వపడ్డాను! అతనినోటి వెంట నాసౌందర్యాన్ని గూర్చి విన్నాక - నాకన్న సౌందర్య వతు లనబడేవాళ్ళు ఎట్లా వుంటారో ననిపిస్తోంది!

గడియారం రెండు దాటుతోంది. అవును; రాత్రినాకోసం ఎందుకు ఆగుతుంది? నిగ్రహం పేరిట వాంఛల్ని చంపుకో వటం క్రూరమేననిపిస్తోంది. అతన్ని ఎంతశక్తితో ఆకర్షిం చానో, ఎంతగా ఈ రాత్రి కష్టపెట్టానో — అంత ప్రతి ఫలమూ ఇచ్చితీరాలి. నా కొంటెతనంతో కొరివిపెట్టి నెత్తి గోక్కున్నట్టయినా నాకు విచారంలేదు. ఎందుకంటే సమర్థ మైన బాహువులకింద దాగటం ప్రకృతి నేర్పిన పాఠమేకనుక!

ఇన్నాళ్ళూ నేను ఎవరికీ అందకుండా దాచుకొని, అనేక మందిని ఆశతో ఏడిపించ గలుగుతూన్న - ఆ నవయవ్వనాన్ని మొట్టమొదటిసారి అతనికి అర్పించవలసి వచ్చింది. ఆ రాత్రి మొట్ట మొదటిసారిగా అతను నా పక్కలోని సగభాగానికి

అర్హుడని రూపించి, నాకుపూర్తిగా బోధపడేట్టు చేశాడు.

తెల్లార వస్తోంది. అలసిన అతనిముఖాన్ని నా నుండి వేరు చేసుకోలేకపోతున్నాను. రాత్రి వీచిన చలిగాలిలోని విలువ అతని కౌగిట్లో ఉంటేనేకాని బోధపడలేదు. 'పాపం' అనబడే దానికి ఎదురీతలోగల మాధుర్యం అర్థమైంది.

"సరే. వెళ్తాను... రేపట్నుంచీకూడా ఇంత అవస్థా పడమంటావా ?" అన్నాడు.

నేను అతని రొమ్ముమీద తల ఆనిస్తూ మెల్లిగా "పడతారా ?" అన్నాను.

"ఆఁ - నువ్వు నడిసముద్రాల్లో మేడకట్టుకు కూర్చున్నా వస్తాను. దూరాన ఉండి నాచేత ఫీట్సుచేయించిన నువ్వు, నేను కోరిన ఆనందాన్నిచ్చాక ఇంకెంతైనా చేయించగలవు. ప్రాణగండమైన నడుంకట్టి దూకుతాను."

నాకోసం ప్రాణాన్ని ఒడ్డే వ్యక్తి ! నావాడు అనుకొన్న అతన్ని, యీ రాత్రి ఎందుకు సృష్టింపబడ్డదో నాకు వ్యక్తపరచిన, ఆ అందగాణ్ని అవస్థల పాలుచెయ్యగలనా ? తన తృప్తే — నాతృప్తిగా చెయ్యగలవానికి, ఒకసారి లొంగిపోయ్యాక తిరుగుబాటుచేసి కష్టపెట్టనా ?

అన్నాను : "అక్కర్లేదు. అట్లాంటి అఘాయిత్యాలు చెయ్యబోకండి. మా రహీమ్‌తో చెప్పి ఏదో సదుపాయాన్ని చేస్తాను-"

తల తిప్పి వెళ్ళిపోయ్యాడు. తెల్లవారింది. రాత్రి నిద్ర లేకుండా అనుభవించిన సౌఖ్యాన్ని తలుచుకుంటూ అద్దంలో చూసుకున్నాను. నలిగిన శరీరకాంతితో, బడలికతోకూడిన

ముఖమూ, చెల్లాచెదరైన కురులూ, ఎఱ్ఱపడ్డ చెక్కిళ్లూ, చూసేందుకు నాకే ముచ్చటగా ఉన్నయ్.

ఆ మర్నాడు, అతను మా నాన్న దుస్తులతోనూ, నేను చీరతోనూ స్కూలుకు వెళ్లాం. కాని ఆ దుస్తుల మార్పులో గల కీలకాన్ని గ్రహించగలవాళ్లు ఆస్కూల్లో ఎవరున్నారు ?

నాకు రాత్రి గర్వభంగమే అయింది. నన్ను జయించగల వ్యక్తి ఎదురయ్యాడు. కాని గర్వంఅనేదానికికూడా మితిలేక పోతే అది ఆనందాన్ని ఇవ్వలేదేమో ?

ఆనాటినుంచీ ఏ కుఱ్ఱాణ్ణీ ఏడిపించదలచుకోలేదు. అసలు అనర్హులైన ఈ కుంకల్నందర్నీ నా చుట్టూ తిప్పుకోవటం - నన్ను నేను తక్కువచేసుకున్నట్టుగానే భావించాను.

సంవత్సరం ఆఖరిదాకా నా సఖులు "జయకు అతనెక్కడ అందుతాడే ?" అంటూనే ఉన్నారు.

'ఒక్కరాత్రి మీకళ్ళపడితే జయ చలాయించే అధికారం అర్థమౌతుంది. జయకు అపజయం లేదు' అనుకుంటూ వారిమాటల్ని అంగీకరించినట్టుగానే నటించి, తలతిప్పి నవ్వేదాన్ని.

మొత్తంమీద ఆసంవత్సరం స్కూల్ఫైనల్ క్లాసులో ఇద్దరమూ తప్పి కూర్చున్నాము. కాని ఆ రాత్రులన్నింటినీ వృథా పోనివ్వకుండా, వేరొక చదువు చదవటంలో ఒకరిని మించిన చెయ్యి ఇంకొకరిది అవటంవల్ల - వెధవపరీక్ష పోయినందుకుమాత్రం విచారించలేదు !

— సెప్టెంబరు, 1941.

# కథకుడు

తన విషయంలో గర్వపడాల్సింది యేమైనా వుంటే—అది శ్రీపతి కథకుడుగా సంపాయించుకొన్న పేరు మాత్రమే! గత ఆరు సంవత్సరాలకృషీ ప్రజల పొగడ్తలరూపంలో దేశ మంతటా వెదజల్లబడ్డది. తన కథ ప్రచురితమైననాడు తనను కొద్దో గొప్పో ఎరిగినవాళ్లందరూ ఎదురై "మీ కథ చాలా బావుంది—" అని చిరునవ్వుతో కూడిన అభిప్రాయాన్ని జారీచేస్తారు. ఒకళ్లిద్దరు మరికొంత అదనపు ఓపికతో తన కళాభిరుచిని అదేపనిగా స్తుతిస్తూ రెండు మూడు రోజులు వెంటపడ్డారు. కాని, కనీసం కాఫీడబ్బులయినా గిట్టుపాటు కాకపోవటంవల్ల త్వరగానే మేల్కొని నిష్క్రమించారు.

సంపాదకులు సయితం తన కథలు బాగున్నాయంటారు; మరికొన్నింటికి ఎదురుచూస్తున్నా మంటారు. ఎంతవాడినా ఖర్చువని పదజాలంతో తనను మెచ్చుకుంటారు. దేశంలోని వివిధప్రాంతాలలోని పాఠకులు పోస్టుద్వారా తనను మెచ్చు కోవటమే–తన పేరుకు ప్రబల నిదర్శనం.

బీదరికసమస్య వొక్కటే తనకళాభివృద్ధికి పెట్టని ఆనకట్ట! ఉన్నత భావాల్తో రచనను సాగిస్తూన్న సమయంలో గృహిణి ఇంట్లోకి కావల్సిన సరుకుల జాబితాను–వంటింట్లోంచి ఏకరువు పెడుతుంది; ఇంక కలం ముందుకు సాగదు. మనస్సు పాడౌతుంది. గాయపడ్డ హృదయంతో పిచ్చివాడులాగు ఊరంతా తిరిగి ఏ అర్ధరాత్రి సమయానికో కొంపజేరుతాడు. సగంరాసి వదిలేసిన ఆ కథవిషయం తిరిగి ఆలోచించేశక్తి

మాయమవుతుంది. మరో సమయంలో కొడుకు శిథిలావస్థలోవున్న తన బట్టలమూటతో తయారై, వాటిని సాక్షులుగా చూపుతూ, ఫిర్యాదు చేస్తాడు. నిర్మల తటాకంలో రాయి పడ్డట్టు—జాగ్రత్తగా పదిల పరుచుకొన్న ఉన్నతాశయాలన్నీ పటాపంచలౌతై. ఇంట్లో కూర్చొని రచనను సాగించేశక్తి తనలోలేదు. ఏ అర్ధరాత్రిగాన్నా ఇల్లంతా మాటుమణిగాక, రచనను సాగిద్దామనుకొని, లాంతరు వెలిగించబోతాడు. అందులో నూనె వుండదు; నిస్పృహాతో కలం ముడుస్తాడు. పోస్టేజీకి డబ్బులేక—తన రచనలు అచ్చుకు పోకుండా పదేసి రోజులుకూడా ఆగవలసి వచ్చేది. తలవెంట్రుకలన్ని కష్టాలననుభవిస్తూ నలిగుతూ రచనను సృష్టించాలి...తన రచనల్ని చదివి ఆనందించేవాళ్ళు దేశంలో చాలామంది ఉన్నా-వారెవరికీ తన కృషితో మాత్రం సంబంధం లేదు. తనను కథల్లో చూసిన పాఠకులకు—తన వాస్తవిక జీవితంలో ఏభాగమైనా తెల్సునా అనేది అనుమానించ వలసిన విషయం. తన ఆశయాల్ని మెచ్చుకొనేవారికి, తన జీవిత సమస్యలతో పనేమిటి ?

ఆ రాత్రి లాంతర్లో నూనె వుండుటమే తనకు ప్రోత్సాహమై—ఏకాగ్ర దృష్టితో నిద్రాముద్రిత ప్రపంచంలోంచి, తెంచుకుపోయి నూతనవాతావరణంలో కథరాస్తున్నాడు. మధ్యలో గృహిణి "ఏమిటండీ అది ?" అన్నమాటలకు అతను ఉలిక్కి పడ్డాడు. ఏదో నేరంచేసినవాడిలాగు కొన్ని నిమిషాలవరకూ నోట మాటరా లేదు.

"క—థ"

"కథ!" అని వెటకారంగా నవ్వి ఆమె అంది: "కూటికీ గుడ్డకూ కొరగాని యీ కథలెందుకు? గుడ్డికన్ను మూసినా, తెరిచినా వొకటే—మీ రచనలుకూడా కుటుంబానికి అంతే ఉపయోగకరంగా వున్నై. కడుపులో చల్ల కదలనివాళ్లకు కాని—యీ సాహిత్యం మీ కెందుకూ?"

ఆమె కాపరానికి వచ్చిందిమొదలూ, రోజు కొకసారైనా ఈమాటల్ని అంటూ నేవుంటుంది. మొదట్లో అమెకు తన ఆశయాన్ని విప్పిచెప్పేందుకు ప్రయత్నించేవాడు; కాని, తన మాటలు ఆమె చెవినికూడా సోకకుండానే గాలిలో కలిసి పోతూండటంవల్ల-శ్రీపతి కిక్కురు మనకుండా విని ఊరుకో టాన్ని అలవాటు చేసుకొన్నాడు.

ఆమె విసుగుతో గొణుక్కుంటూ పడుకుంది.

రచనకు బ్రేకు పడ్డది. కలం ముడిచి ...ఆలోచించసా గాడు. తనకు తగిన ప్రోత్సాహమూ, సానుభూతీ, ఆదరణా వుంటే—తన రచనలు ఇంకెంత తీర్చి దిద్దబడేవి! ఈ ఒక్క కుటుంబసమస్యే తీరిననాడు — తనవి సాటిలేని మేటిరచనలు అవగలవు. కాని తన జీవితంలో అది... తీరనికోరిక!

బీరువాలో పూర్తికాని తన రచనలదస్తరాన్ని చూసి, తన ఓపికకు తనే ఆశ్చర్యపడుతూ, "నా జీవితసమస్య తీరిన నాడు ఇవన్నీ పాఠకలోకానికి కానుకలు కాగలవు; అందాకా వాటిముఖం నాకూ, నాముఖం వాటికీ మాత్రమే కన్పిస్తూ వుంటుంది—" అనుకొని నిట్టూర్చాడు.

# 2

అదృష్ట జాతకుల మాటకొస్తే శ్రీపతికి కూడా స్థానం ఇచ్చి తీరాలి. ఇతర వారసులు లేని పాతికవేలరూపాయల ఆస్తికి తను యీనాడు అధికారవటం—సామాన్యమైన విషయం మాత్రం కాదు.

ఆ ఐశ్వర్యకాంతిలో — పూర్వపు అతని బీదరికచ్ఛాయ లోని ఏభాగమూ గోచరించదు. విధివశాన, తన తీరనికోరిక తీరినకోరికగా పరిణమించి, తన పూర్వకష్టాల్ని సమూలం మరిచిపొయ్యేట్టు చేసింది.

అతని జీవితలక్ష్యం మాత్రం మొదట్లో మారలేదు. పూర్తికాని తన రచనల్ని అనేకులు చదివి ఆనందించే రోజొకటి ఇంకా ముందుందని అతను నమ్మాడు.

అనేకులు తనరచనలకోసం కాచుకు కూర్చున్నారు. సంపాదకుల ఒత్తిడి జాస్తవుతుంది. పాఠకులు తన రచనల్ని పుస్తకరూపంలో చూడాలని కుతూహలపడుతూన్నట్టు ఉత్తరాలు రాస్తున్నారు. తన పేరు అన్నివైపులనుంచీ ప్రతిధ్వనిస్తోంది.

అతను అనుకొన్న గొప్పసమస్య రూపుమాసినా, దాని స్థానే మరికొన్ని సమస్యలు రాకపోలేదు. ఆ ఆస్తికి ఇప్పుడు మరికొందరు దాయాదులు తయారై కోర్టుకెక్కారు. తన ఐశ్వర్యం వాళ్లచేత కబళింపబడకుండా భద్రపరుచుకోటం మొదటిది—ముఖ్యమైనదీకూడా!

ఉన్న కాస్త తీరికలోనూ పాతరచనల్ని తీస దుమ్ముదులిపి

పూర్తి చేసేందుకు ఉపక్రమించేవాడు. కలం కుంటినడక నడిచేది. హృదయంలో రేకెత్తే ఉన్నతభావాలు కాగితం మీదికి రావటంలేదు. పదాలు తొట్రుపడతై. పూర్వపు రచనను చదువుతే- తెగినచోట పెద్దఅతుకున్నట్టు స్పష్టంగా కన్పిస్తుంది. రచనా సమయంలో—కోర్టూ, ధనమూ, అనుభవమూ, సౌఖ్యమూ జ్ఞాపక మొచ్చి తన నిశ్చలత్వాన్ని కూకటివేళ్లతో కదిలిస్తుంది. తన దనుకొన్న లేఖిని తనకే ఏకుమేకై ఎదురుతిరుగుతోంది; తన కళకు వృద్ధాప్యం వచ్చిందేమో! రచన కుదరక, విసుగుతో విరమించేవాడు. 'కథకుడు'గా తనను తనే నమ్మలేనిస్థితిలో శ్రీపతి తత్వం తయారైంది.

## 3

ప్రభుత్వ చట్టాలకు శ్రీపతిలాటి అనేకమంది జీవితాల్ని తారుమారుచేసే శక్తివుందని-తన జ్ఞాతులు దావా గెల్చిన నాడుమాత్రమే అతను నేర్చుకున్నాడు. శ్రీపతి రెండు సంవత్సరాలు మాత్రమే యీలోకానికి 'శ్రీపతి' అయ్యాడు. ఏకట్టుగుడ్డల్తో అపూరిపాకను వదిలాడో—ఆ కట్టుగుడ్డల్తో మాత్రమే తిరిగి ప్రవేశించాడు. చలనంలేని ఆ మట్టిగోడల మధ్య కూర్చొని రెండు సంవత్సరాల క్రితపు వాతావరణాన్ని వెనక్కు చూసుకొన్నాడు — ఎంతలో ఎంతగా పరిణమించిందీ—తన జీవితం!

ఐశ్వర్యవంతుడుగా ఉన్నప్పుడు తనకున్న పలుకుబడి—తనకొక చిన్న ఉద్యోగాన్ని ప్రసాదించటానికి ఉపయోగ

పడ్డది; ఆజీతం సరిగ్గా కుటుంబరక్షణకు మాత్రమే సరి పోతుంది. తను భాగ్యవంతుడుగా ఉన్నప్పుడు తనలో రేకెత్తిన అంతులేని కోరికలన్నీ నేను అడుగంటిపోయినై.

అర్ధరాత్రి అనేక భావాలమేలుకలుపుతో, హృదయంలో దాగేందుకు తావులేక ఉరికిపడుతూన్న ఊహాల సమూహాపు టొత్తిడితో — శ్రీపతి రచనకు ఉపక్రమించాడు. సరిగ్గా రెండు సంవత్సరాలక్రితం గృహిణిమాటలకు భయపడి మూల నక్కిన 'కథ' — అది! కాలగమనం ఆ రచనలో మాత్రం మార్పును తేలేకపోయింది!

ఇల్లంతా నిశ్శబ్దదేవత తాండవిస్తోంది. దీపపు వెలుగులో నిద్రాముద్రితలోకాన్ని విడిచి నూతన వాతావరణంలో — కలం నిరాటంకంగా సాగిపోతోంది. పూర్వపు రచనతో సరిగ్గా సరిపడే విధంగా రాయటాన్ని ఆకలం తిరిగి యీనాడు ప్రదర్శిస్తోంది. కథ పూర్తయింది. తనలో ఇమిడివున్న 'కళ'కు చలనం లేదని స్ఫురిస్తోంది — రచన చదువుతూంటే — ఏక బిగిని రాసిన కథని తెలుస్తోంది — నశించిందనుకొన్న శక్తి యీనాడు తిరిగి పునర్జన్మ ఎత్తింది — శిశువుగా కాదు; నడి వయస్కగా!

భార్య మేలుకొని అంది: "ఏమిటిది?" అతను ఉలిక్కి పడలేదు — చలించ లేదు.

"క — థ"

ఆమె కూడా పరామర్శ చేయలేదు. కుటుంబరక్షణ సాగుతూన్నన్నాళ్లూ తనకు దిగులు లేదన్నట్టు ఆమె పెదవి విరిచి కిక్కురు మనకుండా పడుకొంది.

శ్రీపతికి పూర్వంసంగతి జ్ఞాపకమొచ్చింది. తనమీద కారాలూ, మిరియాలూ నూరిన తన ధర్మపత్నికి యీ నాడు తన కళారాధనతో పనిలేదు. తను భ్రమించే ఆటంకాలేమీ లేవు—ఉన్నా అవి తనమీద తగిన చర్య తీసుకునేటంత బలంగానూ లేవు.

జీవితాన్ని రెండు వసంతాలు వెనక్కు-తిరిగి చూసుకొన్నాడు; అతని హృదయాంతరాళంలో యీ వాక్యాలు మారుమ్రోగాయ్: "జీవితంలో ఎప్పుడూ ఏదో వొక లోపమూ, సమస్యా ఉండితీరుతయ్. ఉన్నా దాంతో కళారాధనకు ముడిపెట్టుకోవటం తగనిపని. ఐశ్వర్యవంతుడినై నేను ఆరాధించలేని యీ సాహిత్య సేవను-బీదరికంలోనే సాధించగలను. ఈ వాతావరణంలోనే నా సాహిత్యసేవ మిన్నుముట్టగలదు."

మరి రెండు సంవత్సరాల్లో ఇది నిజమే అయింది!

—జనవరి, 1941

# అకులజుడు

గదిలోకి ప్రవేశిస్తూన్నప్పుడే వాతావరణంలో గొప్ప మార్పుందని నాగరాజుకు స్ఫురించింది. ప్రతిరోజూ తన రాకకు ఎదురుతెన్నులుచూస్తూ, అనురాగపూరిత దృక్కులతో తనను ఆహ్వానించే చిత్ర—యీనాడు తనరాకకు తలెత్తయినా చూడకపోవటం నాగరాజు ఆశ్చర్యానికే కారణమైంది. తను గదిలో ప్రవేశించినట్లు నేలను తన్ని చేసిన శబ్దంకానీ, సన్నగాదగ్గిన దగ్గుకానీ ఆమెలో చలనాన్ని కలిగించనే లేదు. తన సమక్షంలో ఏకాగ్రదృష్టితో పుస్తకం చదువుతూండగా నాగరాజు ఆమెను ఇదివరకు ఎప్పుడూ చూడలేదు.

అతను ఖాళీగా ఉన్నకుర్చీలో కూలబడి, "చాలా తీవ్రంగా చదువుతున్నావ్—" అన్నాడు.

ఆమె ముఖం ఎత్తింది. కాని, తనవైపు చూడలేదు. ముడిపడ్డ ఆమె కను బొమలూ, తీక్ష్ణంగా చూసే ఆమె చూపూ, శబ్దమయ్యేట్టు ఆమె పీల్చేగాలీ—వీటి అంతరార్థాలలో ఏభాగమూ అతనికి తెలియలేదు.

"చి-త్రా !" అన్నాడు కొన్ని నిమిషాల నిశ్శబ్దతను తోసి పుచ్చుతూ. ఆమెదృష్టి చలించనేలేదు.

"దీర్ఘాలోచనలో ఉన్నావా ?" ఏదో చెప్పబోయి ఒణికిన ఆమె పెదవుల్ని అతను గమనించక పోలేదు.

"చిత్రా ! ఒంట్లో కులాసాగాలేదా ?" స్నేహాన్ని వ్యక్త

పరిచే కంఠధ్వనిని ఉపయోగించి, ఆమె మృదుహాస్తంకోసం చెయ్యిజాపాడు.

ఆమె చీకాకుతో వెనక్కు జరిగి గంభీరస్వరంతో అంది. "ఆఁ... బాగానేవుంది—కాని రేపటినుంచీ తమకిది రాదగిన స్థలంకాదని చెప్పేందుకు విచారిస్తున్నాను—"

ఆమె చూపుల్లోని పదును తనను ఆజ్ఞాపిస్తోంది. దీన్ని ఏవిధంగానూ తను వేళాకోళంగా తీసుకొనేందుకు అవకాశం లేదు. కోపాన్ని వెలికక్కి ఆమె ముఖాన్ని చూడలేక పోయ్యాడు. కొన్ని క్షణాలవరకూ ఆతను నిర్జీవప్రతిమవలె నిలబడి పొయ్యాడు.

"నా నేరమేమిటో అర్థమవటంలేదు..." అన్నాడు తన చెవులు ఇదివరకు వినని కంఠధ్వనితో.

"అర్థమవదు!" అని వికటంగానవ్వి, "అమాయకస్త్రీని అన్యాయం చేయటానికి ప్రయత్నించటం ఎందుకు అర్థమా తుంది...?" అంది.

" అదే ఏమిటో సరిగ్గా చెప్పు"

"నాదగ్గర దాయనక్కర్లేదు రాజూ! ఇన్నాళ్ళూ నీ సంగతి గ్రహించకుండా ప్రేమించటం నాదే బుద్ధితక్కువ! స్నేహధర్మంలో నాగొంతు కొయ్యాలని చూశావ్!—"

"చిత్రా! నీకు మతిపోతోందా?" అన్నాడు విసుగ్గా!

ఆమె కంఠధ్వని హెచ్చింది; ఆ ధ్వనిలో ఎంతెంత కఠిన పదాలు వర్షిస్తాయోకూడా ఆమె ఉద్రేకానికి తెలియదు...

"ఇదివరకే పోయింది! అందుకనే ముందువెనుకలు ఆలో చించకుండా ఏక బహిష్కృతుణ్ణి, కులగోత్రాలు లేనివాణ్ణి

ప్రేమించటం సంభవించింది."

"అంటే ?" అన్నాడు మాటకు అడ్డువచ్చి.

"అంటే ?... లేచివచ్చిన స్త్రీకుమారుణ్ణీ ... కులహీనుణ్ణీ ... తెలిసిందా ... ?" అతని తలమీద పిడుగు పడ్డట్టయింది. ఇంత నిందను భరించటంకన్న మృత్యువు నయం !

"చి—త్రా !" అన్నాడు గదంతా దద్దరిల్లేట్టు. ఏదైనా ఆయుధం ఉంటే తను ఆసమయంలో ఉపయోగించి తీరేవాడు.

ఆమె చలించలేదు. మునిపంటితో పెదవిని కొరికి ఇంకా కఠినస్వరంతో అంది: "నన్ను బెదిరించలేవ్ !... ఈనాటి నుంచీ, యీ క్షణంనుంచీ, నువ్వు నాకు అపరిచితుడివి... మర్యాదగా వెళ్ళిపో-నీ పైపూతలతో లోకాన్ని మోసం చెయ్యలేవని తెలుసుకో... వెళ్ళు-ఊఁ... వెళ్ళు..."

ఎల్లా బైట పడ్డాడో తనకే తెలియదు. కఠినంగా చిత్ర అంటూన్న "వెళ్ళు... వెళ్ళు..." అన్నమాటలు ఇంకా అతని చెవుల్లో గింగురు మంటూనే ఉన్నై. వెనక్కి-తిరిగి చూశాడు. దూరాన ఆ ఇంట్లోని లైటు మిణుకు మిణుకు మంటోంది... ఆ అగ్నిపర్వతంలోంచి బైటికి వచ్చాడు ! రోడ్డుమీద నడుస్తూన్న జనమంతా తనను విమర్శనా పూర్వకంగా చూస్తూన్నట్టుంది. తలవంచి నడుస్తూన్నా, బాధగా నేవుంది—! ఎల్లా గదిజేరాడో కూడా తెలియదు.

## 2

నిజమా ? కలా ? ఏమైందీ ? తనతల్లి ...తనను కన్నతల్లి లేచివచ్చిన కులటా ? తన బి. ఏ. విజ్ఞానమూ, వ్యక్తిత్వమూ,

ఏవీ కోరగానివి ! చిత్ర ! మధురతమ సంభాషణల్లో తనను ఉద్వేళ్లూరించే వ్యక్తి ! ఈనాడు ఇంత విచిత్రరూపునూ, భయంకరమూ రిస్తీ ప్రదర్శించింది ! ఆమెనోటి వెంటవచ్చిన అంత కఠిన పదాలు కూడా భాషలో ఉన్నయ్యా ? ఎంతలో ఎంతమార్పు ! తన జీవితాన్ని నాశనంచేసేందుకే ఆ నారీ ఛాయలోనీ భీకరత అంతా కరుడుకట్టి ప్రత్యక్షమైంది... ఆ దృశ్యాన్ని తను తలుచుకొని దుఃఖించనూ లేడు. కాని మరిచి పోనూ లేడు !

తల్లి ! మహాపాపి ! మాతృహత్య పాపంకాదని తనకు ఏ శాస్త్రమైనా చెప్పివుంటే, తను నమ్మివుంటే ఇంత హృదయ భారానికి గురయ్యేవాడు కాదేమో ? తన జన్మరహస్యాన్నీ, కులగోత్రాల్నీ ఇరవై రెండేళ్లుగా తననుంచి దాచిపెట్టి యీనాడు అంత బాధనూ ఒక్కసారి అనుభవించమని ఆజ్ఞా పించిన రాక్షసి...తల్లట ! ఏ సుయోధనుడు, ఏ పాంచాలి ఇంత పరాభవాగ్నితో ఉడికి పోయ్యారు ? తలగడాతడిసినా ఆ పరాభవాగ్ని ఆరదు !

ఇక ముందు తను ఏముఖం పెట్టుకొని కాలేజికి వెళ్తాడు ? ప్రియురాలు పోయిందన్న విచారంకన్న...తను అపవిత్రుడని తెలిసిన బాధ ఎక్కువైంది. ఏ విజ్ఞానంతో తను లోకాన్ని కన్నెత్తి చూడగలడు ?

గడియారం ఒంటిగంట కొట్టింది.

మరి గంటకు తనకొక రైలుంది...

తల్లి !...మాధుర్యం లేదా మాటలో !

"తల్లి...తల్లి !" బిగ్గరగా అని, పళ్లుకొరికాడు.

ఆమెను అడిగి తెలుసుకుంటే? తెలుసుకోవటం కాదు; శిక్షించాలి! తనజీవితపు రాణింపో, క్షీణింపో తెలియాలి! మెల్లిగా తలొంచుకొని స్టేషన్ వైపు నడవసాగాడు.

## 3

తలుపు తెరవంగానే—వాడిన ముఖంతో, నిప్పుల్ని కక్కే కళ్లతో, చిందరవందరగా రేగిన తలవెంట్రుకలతో, ఒణుకుతూన్న పెదవుల్తో—కళ్ళెదుట ప్రత్యక్షమైన నాగరాజును చూసి ఆమె ఆశ్చర్యపోయింది! నాగరాజేనా? నిద్రకళ్లను తుడుచుకుంది... వాడే! ఎందుకొచ్చాడూ—ఇంత ఆత్రంగా, అర్ధరాత్రి?

నాగరాజు మాట్లాడకుండా వెళ్లి గదిలో పక్క మీద కూలబడ్డాడు. ఆమె వెళ్లి మధురంగా అంది: "శెలవలిచ్చారా నాయనా?"

పళ్లుకొరుకుతూ, "అవును—శెలవలు—ఇంక వెళ్లక్కర్లేదు—" అన్నాడు.

"నాగూ!"

"నీతో మాట్లాడాలిముందు—" మామూలు ధోరణిలో తలవూపింది.

అపవిత్రురాల్ని, అపవిత్రుడు దోషిగానిలబెట్టి ప్రశ్నించటం లోకానికిది మొదటి సారే కావచ్చు.

'అమ్మా!' అని గొంతుదాకా వచ్చింది. కాని యీ దుష్టురాలికి ఆ పవిత్ర శబ్దాన్ని ఉపయోగించటం—తన నేరాల సంఖ్యకు మరొకటి కలుపుతుందేమో?

"ఏది ఏకులం—?" అనగలిగాడా ఆ మాటల్ని? ఎంత

కఠినంగా అడిగాడు! పరాయి అసహాయురాల్నయినా ఇంత ధైర్యంగా, కరుకుగా ప్రశ్నించగలడా తను?

"నా—గూ!" కోపం లేదు ఆకంఠంలో!

"నేను అడిగిందానికి సమాధానంచెప్పు—"

ఆమె ఆశ్చర్యపోయింది; కాని వెంటనే తెప్పరిల్లి "నాకు కులంలేదు నాయనా!" అంది.

"నా తండ్రి ఎవరు?" న్యాయాన్ని పరిశీలిస్తూన్నప్పుడు దయకు సందివ్వక పోవటం ముఖ్యంగా గమనింప దగ్గదని నాగరాజు నమ్మాడు...

ఆమె మాట్లాడలేదు. ఆమెకంటి వెంట నీరుకార నారంభించింది. నాగరాజు చూడలేక పోయ్యాడు; కాని, దోషి తన నిర్దోషత్వాన్ని నిరూపించుకునే సాధనాల్లో కన్నీళ్లు పెట్టుకోవటం తేలికైందని అతనికి తెలియక పోలేదు.

"ఔనమ్మా! యీ ప్రశ్న నిన్ను గాయపరచవచ్చు. కాని యీ ప్రశ్నకే నేను ఇంతకుముందు యమబాధను అనుభవించాను. నా జీవితమంతా యీ ప్రశ్నమీదనే ఆధారపడి వుంది..." ఎంత ప్రయత్నించినా ఆ రక్తస్పర్శ తనచేత 'అమ్మా' అనిపించ గలిగింది!

కొన్ని నిమిషాలపాటు ఆమె మాట్లాడేందుకు వ్యర్థ ప్రయత్నంచేసి, చిన్న స్థాయిలో చెప్ప నారంభించింది—

"నాకు కులంలేదు—గోత్రంలేదు—ఊరూ పేరూ లేని దాన్ని—అపవిత్రురాల్ని—సంఘ బహిష్కృతను. లోకం లోని పాపుల్లో ప్రథమస్థానం నాది. ఇది నిజమే కనుక దీన్ని చెప్పేందుకు నాకు భయంలేదు—కాని నా పాపాల్లో

కల్లా క్షమించరానిది—నిన్ను కనటమే నాయనా! నా బాధలో కొంత భాగాన్ని నీకూడా పంచి ఇచ్చాను. నా నేరానికి నీకుశిక్షపడ్డది... ఈతల్లికడుపున పుట్టటమే నీతప్పు—దీన్నే ఎవ్వరూ క్షమించరు—"

"అమ్మా! నా తండ్రి?" ఆజ్ఞను సూపించే కంఠధ్వని అది.

ఆమె అర్ధోక్తిలోనే అందుకుంది: "నేను చెప్పలేను—ఆ గడిచిన జీవితంలోని ఏభాగాన్నీ నేను జ్ఞాపకం చేసుకొని బాధపడలేను— ఆ మోసగాణ్ని గూర్చి చెప్పి ఏం ప్రయోజనం? నీ జన్మకు మాత్రమే కారకుడై—విశాల విశ్వంలో నిన్నూ, నన్నూ, విడిచి ఎక్కడికో వెళ్ళిపోయ్యాడు; సంఘం ఒప్పుకోని వివాహం మాత్రమే ఐంది—నువ్వు విజ్ఞానవంతుడివయ్యావ్; ఇన్నాళ్ళనుంచీ ఎన్నికష్టాలొచ్చినా నిన్ను చూసి నాకు నేనే ఓదార్చుకొన్నాను. ఇంకెవ్వరికూడా చెప్పవోక—నేను నీ తల్లినని. నన్నొక దాసిగా, దాదిగా వ్యవహరించు; అదే నాకు శిక్ష; నేను కూడా అలాగే చెప్పుకుంటాను. ఇది నీభావి జీవితాభివృద్ధికి తోడ్పడితే- అదే నాకు పదివేలు... నాతండ్రీ! యీనాడు తెలుస్తోంది — నాచిట్టి బాబుకు నేనుచేసిన తీరని ద్రోహం! ఈ అపవిత్రురాలికి పుత్రుడివైనందుకేగా నీకీ బాధ? నన్ను చంపు నాయనా! నీ అభివృద్ధిని చూసి నా ఆత్మ ఆనందిస్తుంది..."

నాగరాజుకు భూమ్యాకాశాలు ఏకమౌతూన్నట్లనిపించింది. ఆమాటలు అతని హృదయ కుహరంలోని శక్తులన్నింటినీ మేలొకొల్పినై. తన సౌఖ్యానికి బలి స్తంభాన్ని ఎక్కే తల్లి!

చాలదా తనకి విశాల విశ్వంలో ఇంత సానుభూతి చూపే ఒక్క ప్రాణి? తన కులీనత ఇంతకన్న ఎక్కువ సానుభూతిని ఎల్లా సంపాదించుకో గల్గుతుంది?

కాలేజి జీతంకోసం ఆమె తన ఆభరణాల్ని అమ్మి డబ్బివ్వటం అతనికి గుర్తొచ్చింది. ఏ కమనీయ హస్తాలపైన తను పెరిగి పెద్దవాడయ్యాడో — వాటినేనా తను తృణీకరించింది? మాతృశబ్దానికి లేని అపవిత్రతను తను కాదా ఇచ్చింది? ప్రేమ! ఆర్నెల్ల స్నేహంతో చిత్రపైన పాతుకుపోయిన ప్రేమ! కులీనత పెనుగాలితో, కూకటి వేళ్ళతో పెల్లగిలిన ప్రేమ! ఇరవై రెండేళ్ళుగా కడుపులో పెట్టుకు కాపాడిన తల్లి మీద నేనా లేక పోయింది? అసలు ఆ 'ప్రేమ' తనలో వుందా?

"అ—మ్మా!" అన్నాడు గద్గదికతో.

"ఒద్దు నాయనా? నన్ను 'అమ్మా' అనొద్దు. తుదిసారి నిన్ను దీవిస్తాను: 'నీ అభివృద్ధికి ఆదైవాన్ని తోడ్పడమని. నన్నొక నూతన వ్యక్తిగా మాత్రమే చూడు — బీదదానికీ, కులటకూ పుత్రులెందుకుంటారు? — వెళ్లు బాబూ! వెళ్లు—ప్రపంచం నన్ను నమ్మలేదు. — నా కుమారిడివై నంతకాలమూ నిన్నుకూడా నమ్మలేదు—నాకు విలువలేదు. అదే నీకూ ఎర్రిస్తుంది... కాని, లోకాన్నే నిన్ను నమ్మేట్టుగా చేసుకొని మోసగించటం నేర్చుకో బాబూ— "

ఇది ఎంత సాధ్యమో తనకు తెలుసు. కోటిసంవత్సరాలు తలకిందులుగా తపస్సుచేసినా సంపాదించగలడా ఇలాటి మధురమూర్తిని? తను ఆజన్మాంతమూ దాసానుదాసుడైనా తీరుతుందా—ఆ మాటల రుణం? కులీనతకు వస్తే—

యీ లోకంలో చాలామంది ఉన్నతస్థానాలకు ప్రచండ చలనం కలిగి తీరుతుందని తనకు తెలియకపోతేగా ?

"అమ్మా ! ... నాకొద్దమ్మా — అల్లాంటి ప్రదర్శనా గౌరవం..." ఆమె పాదాల్ని తాకుతూ, "నువ్వు అపవిత్రురాలివా ? కాదమ్మా—! నీ యీ పాదరేణువుల్లోకూడా పవిత్రతవుంది! అది ఎవ్వరికీ కన్పించదు ; కన్పించినా ఒప్పుకోరు. నాకు కులీనత అక్కర్లేదు. ఒక్క జన్మవిధానంలోనే మనిషి విలువ వుంటే లోకంలో అనేకమందికన్న నేనే గొప్పవాణ్ని..." అని పాదధూళిని కళ్ళకద్దుకొన్నాడు.

ఆమె ఆలోచించి అంది : "వెళ్ళి చదువుకో నాయనా !"

"నాకు చదువక్కర్లేదు అమ్మా ! నేను గ్రహించలేని అనేక విషయాల్ని—ఏ చదువూ చదవని నువ్వు గ్రహించావు. నన్ను కాదనకమ్మా ! నీ పాదసేవలేని ప్రతిక్షణమూ నాజీవితంలో వ్యర్థమే !—ఇక్కడే వుంటాను—"

"పొరపడ్డావ్ ! నాగూ ! నీ జీవితానందానికి నేను పెట్టని ఆనకట్టను—"

"కాదమ్మా కాదు; ఏకులీనతా, ఏ ఇక్కట్లూ, ఏబాధా, ఏ విషాదమూ ఆటంకపరచలేని నీ కరుణార్ద్ర దృక్కులే నాకు కావాలమ్మా—!" అని ఏ లోకమూ, ఏ సంఘమూ, ఏఅపవిత్రతా అడ్డురాని మాతృమూర్తి కౌగిట్లోని సౌఖ్యాన్ని అనుభవించాడు—అకులజుడు !

— మే, 1941.

# "కులట!"

కుటుంబ పరిస్థితులు అతిక్లిష్టంగా వున్నాయి. ఊరినిండా అప్పులూ— చేతులో దమ్మిడీ కూడా లేకపోవటమూ— ఆరేళ్ళ తమ్ముడు మినహాగా 'నా'అనేవాళ్ళే కరువౌటమూ- పూటకూటికి మాడుతూ కూర్చోటమూ—పై పెచ్చు వారం రోజుల్నుంచీ చిన్న తమ్ముడికి తీవ్రంగా జ్వరం తగులుతూ వుండటమూ—ఇవన్నీ ఒకసారిగా మిన్ను విరిగి మీద పడ్డట్లు—మాలతిని వేపుకుతింటూన్న తీరని సమస్యలు. ఇవన్నీ పరిష్కరించబడేందుకు కావాల్సింది ఒక 'ధనమే!' ఆ ధన సంపాదనకేగా— యీ జనం తిరుగులాడటం!

డబ్బులేని తనకు ఏడాక్టరు సహాయంచేస్తాడు? ఏవిధంగా తను తన తమ్ముణ్ని ఆదరించగలదు? ఒకప్పుడు తన జీవితం- ఏ భర్త చేతుల్లో రాణిస్తుందని భ్రమపడ్డదో—ఆ ప్రబుద్ధుడు చల్లగా స్వర్గం చేరుకున్నాడు! తన జీవితమే తనకొక తీరని సమస్యగావుండగా—ఆతమ్ముడు— వాడుకూడా తనకొక గుదిబండ! సూర్యచంద్రులు నివసిస్తూన్న ఆపూరిపాక మినహాగా ఏ ఆస్తీ లేని తనకోసం ఎవరు నిట్టూర్పు విడుస్తారు?

కుటుంబ గౌరవంకూడా తన 'ధనం'తో పాటే హారతి కర్పూరంలాగు హరించుకు పోయింది! ఇంతమందికీ కూడు పెడుతూన్న ఆదైవం దృష్టికి—తన తమ్ముడూ తనూ దూరమై పోయినట్లుగా వుంది! తనలాటి వాళ్ళను యీ భూమాత ఇంకెన్నాళ్ళు మొయ్యాలో?

కుర్రవాడు మూలుగుతూ, "జా—వ!" అన్నాడు. ఎక్క-

ఇంచి వెతుక్కు వస్తుంది—జావ? తమ్ముడు నిరుత్సాహ పడకుండా, "తెస్తాను నాయనా!" అంది.

"ఇప్పుడే!" అన్నాడు కుర్రవాడు.

తమ్ముడి తలను తాకుతూ, "ఇప్పుడే తెస్తాను" అంది. వాడు సమాధాన పడ్డట్టు తలవూపి, ఏదో బాధతో కళ్లు మూశాడు. వాడికోసమే తను ఒకికిపడింది! వాడికోసమే—బరువైన కాళ్ళను యీడ్చుకుంటూ మెల్లిగా బజారులో పడ్డది.

పట్టణంలోని ఎలక్ట్రిక్ లైట్లు అవిచ్ఛిన్నంగా కాంతిని ప్రసరింప జేస్తున్నాయి. షికారు వెళ్ళి చల్లగాల్ని మేసి వస్తూన్న పెద్దమనుషు లందరూ, తనను చూడకుండానే సాగిపోతున్నారు. చూచిన ఒక రిద్దరూ 'నీఖర్మం అంతే!' అన్నట్లు నవ్వి చుర చురా చూస్తూ చర చరా సాగిపోతు న్నారు. తన నీడను మాత్రం తోడుగా తీసుకొని మెల్లిగా అలసి, సొలసి వీధి చివరి కోమట్ల దగ్గరకు చేరింది.

షావుకారు ఆమెను తేరి పారజూచి, "ఏమమ్మా! పాతబాకీ ఇంకా జమకట్టనే లేదుగదా!" అన్నాడు.

"ఇస్తాను బాబూ! ఒక్క గా గోధుమ నూకను ఇద్దూ?"

"చాల్చాల్లే—ఇదేమన్నా వ్యాపారమా? గోంగోర పచ్చడా? వెళ్ళవమ్మా—వెళ్లు; ఎవరన్నా వింటే నవ్వు తారు—"

ఒకప్పుడు సకల సౌఖ్యాల్ని అనుభవించిన తనకు ఎంత పరాభవం! వంచిన తలను ఎత్తకుండా, నిరుత్సాహంగా—గమ్యస్థాన నిర్ణయం లేకుండా నేబయలుదేరింది! ఆమె సౌఖ్య దినాలన్నీ కళ్ళకు కట్టినట్టుగా ఉన్నాయి. అధమం వాటిని

మరచిపో గలుగుతే ఆమెకు కొంతమనశ్శాంతి ఏర్పడివుండేది కాని, ఇది మానవాతీతమైన విషయం! చీకట్లో ఎవరూ చూడకుండా కన్నీళ్ళను ఒత్తుతూన్న చీరకొంగు అప్పటికప్పుడే బాగా తడిసిపోయింది!

తను మాడినా—చచ్చినా—తమ్ముడి గతేమిటి? మందుల్నీ మాకుల్నీ పొయ్యలేకపోయినా తను వాడికి జావనుకూడా కాచి ఇవ్వలేని స్థితికి వచ్చింది! మానవ జన్మ ఎత్తికూడా—కొరగాని తృణాల్లో తనే ప్రథమురాలై వుంటుందని ఆమె నమ్మింది! ఇంత విశాల విశ్వంలో 'దయ' అనే పదార్థం యీనాడు తనకు—కంచు కాగడాలు వేసి వెతికినా—ఎక్కడా కన్పించేట్టు లేదు! సముద్రుడు మాత్రం—చందమామను చూచి—తనలాగే ఘోషిస్తున్నాడు! కాని తనను కనడు; వినడు!

## 2

చేతులోవున్న స్టెతొస్కోపును చూచి డాక్టరని భ్రమపడి వుంటుంది.

"డాక్టరుగారూ!"

"ఏం కావాలి?"— తీక్షణంగా చూశాడా యువకుడు.

"మా తమ్ముడికి వారం రోజుల్నుంచీ జ్వరం—" పొడి గొంతుకతో చెప్తోంది.

పరీక్షగా ఆమెను చూస్తూన్న అతనికి, ఆమెలో ఏమాధుర్యం కన్పించిందో కాని, "నన్ను వచ్చి చూడమంటావా?" అన్నాడు.

ఎంత మధురంగా అడిగాడు! ఆమె తల వూపింది— ఒక విధమైన ఉత్సాహాన్ని కనబరుస్తూ.

"ఏమిస్తావు?" ఈ ప్రశ్న ఏ డాక్టరు దగ్గరా తప్పేట్టుగా లేదు! తను ఎవరికేం ఇవ్వగలదు? ఎవరైనా తనకు ప్రాణదానం చేసినా—వారికి ఈ జన్మలో మాత్రం తను కృతజ్ఞురాలవలేదని ఆమెకు తెలుసు! మానవుల్లో వున్న ధనతృష్ణ సంగతి ఆమెకు తెలియకపోతేగా!

" నాదగ్గరేముంది ఇచ్చేందుకు? "

" నాకు కావాల్సిందే—ఇస్తే— ?"

"నాదగ్గరా? ఏం కావాలి?" అమాయకంగా ఆమె అడిగింది.

"నువ్వు కావాలి — "

తనేం తప్పు చేసిందని— తనను అందరూ ఇంత తేలిగ్గా చూస్తున్నారు? తన వెనుక ఎవ్వరూ లేరనేగా ఈ యువకుడు తనను కోరగలగాడు! స్వార్థమునేది ప్రతి చిన్న సహాయానికీ — నీడలాగు అంటి పెట్టుకు వుండాల్సిందేనా? ఇన్నాళ్ళూ మానవులు ఒక్క డబ్బుకే ఆశిస్తున్నారని తను తలిచింది.—పొరపాటై వుండాలి. తన శరీరాన్ని చూచుకుంది; ఎంత మలినంగా వుంది! ఉదయాన అద్దంలో చూచుకున్న తన ప్రతిబింబం తననే వెక్కిరించింది; 'ఇంత వికృతంగా తయారయ్యావేం?' అన్నట్టు కృశించి, వాడిన తన ముఖం తననుచూసి నవ్వింది! ఈలోకానికి తను పనికివచ్చే విధానం ఇది ఒక్కటేనేమో? ఈ డాక్టరుగారికి తను మానాన్ని బలి ఇవ్వటమే ఫీజు! ఆమె అరచేతుల్లో ముఖాన్ని దాచుకొని

వల వలా ఏడ్చింది.

"ఏదో ఒకటి తేల్చుకో త్వరగా—"

"నన్నెందుకు అపవిత్రం చేస్తారు? నన్నెందుకు బాధిస్తారు? నన్ను క్షమించండి — మీ కాళ్లు పట్టుకుంటా."

ఆత్మాభిమానాన్ని పూర్తిగా చంపుకు మాట్లాడిన ఆమె మాటలకు అరాళ్లు కరిగి వుండేవేమో కాని, అపరేషన్‌లకు అలవాటుపడ్డ డాక్టరుగారి మొండిగుండెకు ఏ చలనమూ కలుగలేదు!

"ఈ నల్లి బొల్లి యేడ్పులకేం—నువ్వు మహా పతివ్రతవైనట్టుగా మాట్లాడుతావేం? అయినా నాకెందుకు ఈ అనవసరపు తెగలాటకం?"—డాక్టరు దబాయించి రెండు అడుగులు ముందుకు వేశాడు.

తన తమ్ముడూ, వాడు తనవైపు దీనంగా, జాలిగా, బాధగా చూసి, 'అక్కా!' అని కష్టంగా పిలవటమూ— అన్నీ ఆమెకు ఒక్కసారిగా కళ్ళముందు జరుగుతూన్నట్టనిపించింది. తను తప్ప తన తమ్ముడికి ఇంకెవరున్నారు? లోకం దృష్టిలో తన ధనంతో పాటు తన పాతివ్రత్యంకూడా జారుకోబట్టేగా—తనముఖ కళనూ, దుస్తుల తీరునూ పట్టి యీ 'సైకాలజిస్టు' తన నొక 'కులట'గా జమకట్టగలిగింది! తను పాతివ్రత్య ధర్మాన్ని త్రికరణశుద్ధిగా నిలబెట్టుకోగలిగితే మాత్రం తనకు జరిగే దేమిటి? లోకం తన నేమన్నా పోషిస్తుందా? లోకానికి తనతో పనిలేనప్పుడు, తనకు లోకంతో మాత్రం ఏంపని? వేరే గత్యంతరం లేనప్పుడు తనలాటి నిస్సహాయకు 'మరోమార్గాన్ని' చూపగలవారెవరే? గొప్ప

ఇళ్ళల్లో చాటుగా, మాటుగా జరిగేవి—పవిత్ర వ్యభిచారా
లయితే — ఇవి అపవిత్రాలు — ఇంతేగా తేడా! ఇది
త్యాగమే అయినా—లోకం హర్షించదు! తనలాటి వాడిన
పుష్పాలకూడా చెయ్యిజాపే—పెద్దలు ఇంకా నిల్చి వున్నా
రనే విషయాన్ని ఆమె ఆక్షణంలో తన జీవితంలో మొట్ట
మొదటిసారి గ్రహించ గలిగింది! అమృతానికి ఆశపడితే—
విషం ఎదురైంది!

"డాక్టర్ గారూ!" ఆగాడు—అతను.

"వెళ్దాం రాండి"

"ఇష్టమేనా?"

చచ్చిన తనను ఇంకా చావ బాదటం దేనికి? విధిలేక
తల వూపింది. డాక్టర్ విజయసూచకంగా చిరునవ్వునవ్వాడు.
ఆకాశంలో చంద్రుడు 'ఇంతకన్న మూలనున్న ముసలమ్మల
మీదికి దండయాత్రచేసి కీర్తి సంపాదించొచ్చు' అన్నట్టు
వెలవెల బోతున్నాడు!

## 3

కుర్రవాణ్ణి పరీక్షించి—డాక్టర్ ఒక మాత్ర ఇచ్చాడు;
కుర్రవాడు దానిని మింగి, బాధగా కళ్ళు మూశాడు.

ఆతురతతో డాక్టర్ ముఖాన్ని చూస్తూన్న ఆమె,
"ఏమండీ?" అంది.

"మరేం ప్రమాదం లేదు"— పెదవి విరిచాడు.

కుర్రవాడు బాధగా, "అక్కా!" అన్నాడు. ఆమె కుర్ర
వాడి వెచ్చని శరీరాన్ని తాకింది; వాడు ఆమె చేతిని గట్టిగా
పట్టుకున్నాడు.

"ఏం కావాలి నాయనా?"

"జా—వ!"

"ఇవ్వొచ్చు"— డాక్టరు గొణిగాడు. ఆమె శూన్య దృక్కుల్లో ఇంటివాసాల్ని లెక్కిస్తోంది.

"కాచి ఇవ్వ—" ఏం సమాధానం చెప్తుంది?

"మాట్లాడవేం?"

"డబ్బుల్లేవు—"

'అందుకే ఇంత సులభంగా నాకు లొంగావు' అన్నట్టు చూస్తూ, డాక్టరు జేబులోంచి ఒక రూపాయి తీసి ఇస్తూ "తీసుకువెళ్ళు—నేను ఇక్కడే వుంటాను" అన్నాడు.

ఒక్క సారిగా ఆమెలో లేనిశక్తి ఏదో ప్రవేశించింది. ఆమె ఉత్సాహ పూరిత నయనాలు డాక్టర్‌కు కృతజ్ఞతను చూపాయి. ఇంత ధర్మాత్ముడైన వ్యక్తికి తను ఏం త్యాగం చెయ్యకూడదు?...ఆమె కాచి ఇచ్చిన జావ తాగాక తృప్తిగా చూస్తూ—కుర్రవాడు నిద్రపోయ్యాడు.

అప్పటికి వూరంతా మాటుమణిగినా, దూరాన కుక్కల అరుపులూ, సిగ్నల్ కోసం కాచుకు కూర్చున్న ఒంటిగంట ప్యాసింజరు బొంగురుకూతా విన్పిస్తున్నాయి; ఇంటి పక్కనే వున్న భావకవి, జాగారాలుచేసి జాగ్రత్తగా తయారుచేసిన ప్రేయసి భావగీత పరంపరను, చెవికోసిన కుక్కలాగు, ఏడుపు రాగంలో, కీచుగొంతుకతో కంఠస్థం చేస్తున్నాడు.

డాక్టరు మెల్లిగా లేచి, తనవైపుఅమాయకంగాచూస్తూన్న ఆమె చేతిని పట్టుకున్నాడు. ఆమె చేతి స్పర్శకు ఎక్కడెక్కడో దాగివున్న కామధూమాలు, డాక్టర్ శరీరాన్నంతటినీ

ఆక్రమించుకున్నాయి. ఆమెకుమాత్రం ఆకరస్పర్శ ఒళ్లంతా గొంగళి పురుగులు పాకినట్టనిపించింది; ఏమైతే నేం? తను వాగ్దానం చేసింది! తన మాటలకు గాలిలో కలిసి, కరిగి పొయ్యే శక్తి లేకపోయింది. అతని మేలుకు తను కృతజ్ఞురాలవ్వాలి. ప్రాణంతో సమానంగా చూసుకుంటూన్న తమ్ముడికి ప్రాణదానం చేసిన అతన్ని తృప్తిపరచడం తనవిధి!... కాని, ఆ భర్తతో పాటే శెలవు పుచ్చుకున్న తన యవ్వన రక్తానికి—చలనం కలగటం లేదు; అందుకు ఆమె శరీరంలోని ఏశక్తీ ఆ సమయంలో సహాయపడి వుండదు; ఆమె తన నారీత్వమే భగ్నమైందేమోననుకొని వుండాలి.

ఆమె మౌనానికి డాక్టరు, "ఏం?" అన్నాడు.

"నేను సిద్ధంగానే వున్నాను"—ఆమె గుండెను రాయి చేసుకో గలిగా ననుకుంది. డాక్టరు ఆమెలోకి—నారీత్వాన్ని చిన్న చిన్న మోతాదుల్లో ఇంజక్టు చెయ్యగలననే ధీమాతో వున్నాడు.

ఆ గుడ్డి లాంతరు వెలుగులో, వెదికి వేసారి, ఆమెలో మిగిలివున్న ఆ కాస్త యవ్వన మధువునూ—యీ డాక్టర్ 'భృంగి' నాల్గో జామున బుడబుక్కల పాట వినపడేటంత వరకూ, గ్రోలాడు. ఆమెకు ఇంకా ఏపతివ్రతల కధల పేజీలు కన్పిస్తున్నాయో కాని డాక్టరు చీకి పారేసే మామిడి టెంక లాగు—ఆమెను ఆ చింకి చాపతో పాటే అవలకు తోసేదాకా ఆమెకు తెలివిరా లేదు. చీరను సవరించుకుంటూ, తేలిపోతూన్న కాళ్ళమీద ఆమె లేచి నిలబడ్డది.

కుర్రవాడు "అమ్మా!" అని వికారంగా అరిచాడు.

ఏ అమ్మా పలకాపోయినా, అక్క కుర్రవాడి పక్కలో జేరి, "ఏం నాయనా?" అంది. కుర్రవాడు కక్కిన రక్తాన్ని చూసేప్పటికే ఆమె నిశ్చేష్ట అయి వుంటుంది. ఆమె మాటకు సమాధానం లేదు. కుర్రవాడి శీతల శరీరాన్ని ఆమె స్పృశింప లేకపోయింది !

ఎవరికోసం తను త్యాగం చేసిందో, ఏ ప్రాణికోసం తన నారీత్వాన్ని వినియోగించి, ఒక నూతన వ్యక్తికి భార్యాత్వాన్ని వహించి, అపవిత్రురాలై సహించి వూరుకుందో— ఆ తమ్ముడే తనకు దక్కలేదు !

"డాక్టరుగారూ !" అంది భగ్నస్వరంతో.

ఇంకెక్కడి డాక్టరు ? అవసరం తీరగానే ఆయనగారు వృడాయించిన ద్వారంలోంచి 'బొంయ్'మని వచ్చిన పెనుగాలికి ఆ గుడిసెలాంతరు రెపరెపలాడి ఆరిపోయింది. దాంతోపాటు ఆమెలో వున్న ఆశాజ్యోతికూడా ఆరిపోయింది. ఆ చీకటి సముద్రంలో ఆమెకు ఇంకేమీ కన్పించటం లేదు. తను చచ్చినా— తన అపవిత్ర దేహాన్ని యీసంఘంలో ఎవ్వరూ-తాకరనే ధృఢనమ్మకంతో, చెట్టుమీది గుడ్లగూబ స్వరాన్ని కూడా వినకుండా ఆమె శాశ్వతనిద్రను వరించింది.

ఏమైనా ఆమె మాత్రం ఒక 'కులట' కింద మారినసంగతీ ఇల్లా వ్యవహరింపబడుతూన్న సంగతీ, నాకూ తెలుసు !

— జూన్, 1940.

# అంతరాత్మ

"ఇందులో నీ సహాయంకూడా చాలా అవసరం" అన్నాడు, తమ్ముడివైపు ఆశగా చూస్తూ, రాఘవయ్య.

"అంటే?" అన్నాడు వెంకటరత్నం, అర్థంకాక.

" ఈ పదిహేనువేల రొఖ్ఖమూ, యీ బంగారు వెండి సామాన్లు, పత్రాలూ- అన్న పొయ్యేదాకా మనకు తెలియవు. ఇందులో మనం కాస్త తీసుకుంటే—?"

"ఆమాట అన్న అనలేదే?"

తమ్ముడి అమాయకత్వానికి నవ్వి, "అంటే ఇంత గోలెందుకూ? అనలేదు కనుక నే రెండో సంతకానికి కల్పించకుండా మనం పూర్తిచేద్దాం!" అన్నాడు.

వెంకటరత్నం చిన్నన్న మాటలకు ఆశ్చర్యపోయ్యాడు. అన్న చనిపోయిన కొన్ని గంటలకే అతని ఆస్తి వివరాలు తమకు తెలిసినై. అప్పుడే దానిలో కొంత భాగాన్ని భుక్తం చేసే దురభిప్రాయాలా?

"ఇది అన్యాయం—"

"న్యాయమైన, కష్టార్జితమైన సంపాదన ఐతే—ఒక మానవ జీవితంలో ఎవరైనా పదివేల రూపాయలు కూడబెట్టగలరా? మనతో భాగాలుపడ్డ అన్నయ్య —ఇంత సంపాదన ఎల్లా చెయ్యగలిగాడో ఆలోచించు—"

ఒకట కష్టార్జితాన్నే గురిగా పెట్టుకుంటే మానవుల్లో ఇంతమంది భాగ్యవంతులు ఎలా తయారయ్యారో వెంకటరత్నానికి అర్థమవలేదు. ఐనా ఇది చాలా దుర్మార్గమైనపని

అని అతని అంతరాత్మ ఘోషిస్తూనే వుంది.

"ఏమంటావు?" అన్నాడు తమ్ముడివైపు చూస్తూ.

"ఒద్దు—"

"ఇంత అమాయకుడి వనుకోలా" అని స్వరం ఎక్కించి గంభీరంగా, "పిరికితనంలో ఇప్పుడేమీ చెయ్యలేకపోతే చేతులు కాలాక ఆకులు పట్టుకోవటమే అవుతుంది. పరువు మర్యాదలు గల మనను చాటుగానైనా ప్రశ్నించేవాళ్ళుండరు.... పోనీ వెండీ, బంగారమూ, పత్రాలూ, అయితే ఎవరైనా అనుమాన పడతారు. అందరి చేతుల్లోనూ నలిగేందుకు హక్కున్న కరెన్సీ నోట్లయితే ఏ ఇబ్బందీ ఉండదు. బాగా ఆలోచించుకో" అన్నాడు తెరిచివున్న ఇనప్పెట్టెలోకి వేలుపెట్టి చూపుతూ.

ఆ కరెన్సీనోట్ల కట్టల్ని చూసేప్పటికి పాపభీతిగల వెంకటరత్నం మనస్సుకూడా చలించింది. చిన్నన్న చెప్పిందాంట్లో నిజం లేకపోలేదు. భాగాలుపడ్డాక తన ఆస్తిలో చాలా భాగాన్ని కోర్టులపాలూ, దురభ్యాసాలపాలూ చేశాడు. రేపు పిల్లలు పెద్దవాళ్ళయ్యాక, వాళ్ళకు రొక్కరూపంలో తనేం ముట్టచెప్పగలడు? ఇదేమంత ప్రమాదమని తను భయపడాలి? దొంగతనాన్ని పట్టుకోవటమంటూ లేకపోతే—ఎంతమంది దొంగలయ్యేందుకు ఉవ్విళ్ళూరుతారో?

చిన్నన్న చెప్పినమాటలు ఎల్లా చెవికెక్కి ఇంజక్షనులాగ పనిచేసెయ్యో కాని, వెంకటరత్నం అర్ధాంగీకారంగా తల ఊపాడు. రాఘవయ్య అమితోత్సాహంతో నవ్వి, "ఐతే ఎంత తీద్దామంటావు?" అన్నాడు.

"నీ ఇష్టం"

"ఆరువేలు—ఏం?"

"కనుక్కుంటారేమో?"

"ఇంకా ఆ భ్రమ నీకు దేనికి? నీ నోటివెంటా, 'నానోటి వెంటా బైటికిరావాల్సిందే కాని—ఇంకోవిధంగా యీసంగతి పరాయివాడికి తెలియటం కలలోనివార్త."

రాఘవయ్య మూడువేల రూపాయిలనోట్లను తన చేతికి అందిచ్చాడు; వాటిని ఎట్లాతీసుకొని జేబులోపెట్టుకున్నాడో ఆతనికి తెలియదు. డబ్బు అందరికీ గొప్ప సమస్యగా ఉన్నప్పుడు దాన్ని హృదయపూర్వకంగా నిరాకరించగలవాడెవడు?

## 2

చిన్నన్న కొడుకు పోయిన సంగతి విన్న క్షణానే వెంకటరత్నం మంచానపడ్డాడు. డాక్టర్లు ఒకళ్ళకు ఇద్దరు మారారు. కాని వ్యాధి ఫలానా అనికూడా గుర్తించలేకపోయారు.

ఆ పాపిష్టి డబ్బును తెచ్చుకున్నప్పటినుంచీ అసలు తనకు అరిష్టం సంభవించింది. పూటకు రెండుశేర్ల పాలు ఇచ్చే ఆవు కాస్తా చావటమేమిటి? తనాబీలాగు తిరిగే తను ఏరోగమూ లేకుండానే మంచమెక్కటమేమిటి? ఆ పాపిష్టి సొమ్ముతో చిన్నన్న కుర్రాడికి గొలుసు చేయిస్తూండగానే—దాన్ని మెడలో వేసుకు తిరిగే ప్రాప్తి లేకుండానే వాడు టపాకాయలాగు చిన్నబిడ్డనొప్పితో ఎగిరిపోవటమేమిటి? ఆదొంగ సొమ్ము పాపఫలితం కాకపోతే దీన్ని ఇంకోవిధంగా తనెల్లా

సమర్థించుకోగలుగుతాడు ?

లంకణాలు ఒకటికి పది అయినై. ఆ అర్ధరాత్రి ఇనపపెట్టె ముందు తనూ చిన్నన్నా కూర్చొని చేసిన వెధవపని తల్చు కున్నప్పుడల్లా వెంకటరత్నం భయంతో ఒణికేవాడు. ఆ బల హీనతలో యీ బాధ మరీ దుర్భరమయింది. వాళ్ళుపోసే రంగునీళ్ళను తాగుతూ ఎలాగో బతికి వున్నాడు కాని— లేకుంటే యీపాటికి తను పెద్దన్నను కలుసుకునేవాడే !

మరి రెండు సూర్యోదయాల తరువాత తన మంచం చుట్టూ జేరిన జనం తను పిచ్చిమాటలు మాట్లాడుతూన్న ట్టుగా సంభాషించటం తనకు తెలుసు. కాని అదంతా స్వప్నంలో జరిగే ఘట్టంలాగు స్ఫురించింది.

ఆ రాత్రి పీడ కలలతో అతని మనశ్శాంతి మరీ చెడి పోయింది. కలలో వదినగారు దీనంగా ఏడుస్తూ ఆరుగురు పిల్లలతో సహా ప్రత్యక్షమైంది. ఆ పిల్లలు—తన పిల్లల లాటివాళ్ళే ! వాళ్ళకు తండ్రిలేని లోటులో కూడా రెక్కలు వచ్చేదాకా జీవనం గడవాలి; మొగపిల్లలకు చదువులు కావాలి. ఆ ముగ్గురు ఆడపిల్లలకూ పెళ్ళిళ్లు కావాలి. ఆ సంసారాన్ని అమది, నిస్సహాయ, ఆ వదినగారు శక్తివున్నా లేకున్నా యీదుకు రావాలి ! కాని ఆమెను ఆసముద్రంలో ముంచేందుకు తను ప్రయత్నించాడేమో ?

అన్నగారుకూడా కలలో కన్పించాడు. కలలకు వచ్చిన వాళ్లకూ, బతికినవాళ్ళకూ భేదం ఉండకు కాబోలు ! అన్న అన్నాడు: "నా మరణశయ్యమీద నా సంసారాన్ని మీ ఇద్దరినీ నమ్మి మీమీద వదిలినందుకు ఇంత ద్రోహమా ?

రక్తస్పర్శనైనా తలచకుండా ఇదేనా మీరు నాకు చూపే కృతజ్ఞత...?"

పెద్దకేకతో వెంకటరత్నం లేచి కూర్చున్నాడు. అతని భార్యవచ్చి, "ఏమిటి?" అని అడిగింది. అతను భయంలో ఏమీ చెప్పలేక పోయ్యాడు; చెప్పదల్చుకోలేదుకూడా.

ఆ మిగతారాత్రి నిద్రాదేవి అతనితో విరోధం పూనింది. అన్న బిడ్డల గొంతులు కోసి ఆరక్తంతో తను ఆనందిస్తూ న్నట్టు స్ఫురించి అతని ఆత్మ ఘోషించసాగింది. తన సంసార పోషణకు సరిపొయ్యే ఆదాయం తనకు ఉండగా తన కెందుకు ఆ అనాథల ఉసురు? అసలు ఆపాడుపనికే యీ శిక్షేమో?

ఎల్లాగైనా యీరకం ఆలోచనల్ని తప్పిద్దామని గట్టిగా కళ్లుమూసుకున్నాడు. కన్ను మూశాడో లేదో చచ్చిన అన్న రూపం ప్రత్యక్షమైంది. మేలుకుంటే పశ్చాత్తాపంతో కుమ లాల్సిన బాధ! కన్ను ముయ్యటానికి కూడా భయమే! తెల్లారిందో లేదో తెలియదు; అవతలిగదిలో వదినగారి కంఠం వినవస్తోంది.

"ఆయన పోయిన పదిహేను రోజులకే ఆబిడ్డ చనిపోవ టం, మరిదికి వెంటనే జ్వరం రావటం... మన ఖర్మం కాకపోతే మరేమిటి? మన వంశానికి ఎంత దుర్దశ పట్టింది?" ఆ తరువాత మాటలు లేవు; వదినగారు సన్నని గొంతుతో కుమిలినట్టు ఏడ్వటాన్ని తన చెవులు గుర్తించినై.

ఇంత దయతో మాట్లాడటాన్ని అతను భరించలేక పోయాడు. తనలాంటి పాపికి ఎంత ఆదరణ! ఎన్ని లక్షల రూపాయలిచ్చి తను ఆలాంటి మాటల్ని వినగలడు? వదిన—చిన్న

తనంలో తను రాత్రి ఇంటికి ఆలస్యంగా వచ్చినందుకు తండ్రి చేత చివాట్లుతిని, ఆకోపంతో అన్నం తినకుండా బిగతీసుకు పడుకుంటే—ఆ అర్ధరాత్రివేళ యీ వదినే తనకోసం లేచి వచ్చి బతిమాలి, అనేక విధాల నచ్చచెప్పి, స్వయంగా తన చేత అన్నం తినిపించటాన్ని తనెట్లా మరిచిపోగలడు? ఆదేవత మీాద నేనా తను కత్తికట్టింది? ఆత్మా, హృదయమూ, ఉన్న తను యీ క్రౌర్యాన్ని పూనబట్టే... చిన్నన్న శరీరంపైన పడ్డ మృత్యుదేవత శీతలహస్తం తనకుకూడా సమీాపంలో ఉందేమో? పశ్చాత్తాపపడి, ఆడబ్బును ఇచ్చేస్తే తనకేమైనా ముక్తి వుంటుందేమో?

కళ్లు మూశాడు—ఆ అన్న!

భార్యను పేరుపెట్టి పిలిచాడు. వదినా, భార్యా పరుగెత్తుకుంటూ వచ్చారు; వదినగారి కళ్లు చెమ్మగిలి ఉన్నయ్. భార్యముఖం వాడి వుంది. ఎందుకు తనింత బాధపడుతున్నాడు?

తనకు తెలియకుండానే ఆమంచంలోంచి వదినగారికి నమస్కరించాడు. ఆమె స్తబ్ధయై చూస్తోంది.

భార్యతో "ఆపెట్టెలోవి మూడువేల రూపాయిలు వదినకివ్వు" అన్నాడు ఒణుకుతూన్న కంఠంతో.

"ఏమిటి—కలవరిస్తున్నారా?" అంటోంది వదిన.

"లేదు—ఏమిటో నేను చెప్పలేను; తీసుకోండి—"

"నాకు అర్థమవటం లేదు—"

"అర్థమైతే యీ దీనుడిమీాద నీ దయావాహిని ప్రవహించదు వదినా!" అని తలగడాలో తలదాచుకొని వెక్కి-

వెక్కి ఏడ్వ నారంభించాడు—చిన్న పిల్లాడిలాగు! తోడి కోడళ్లిద్దరూ ఒకరి ముఖాల్నొకరు చూసుకుంటూ నిలబడ్డారు.

కొంతసేపటికి తన స్థితిని గ్రహించుకొన్నాడు. గొంతుక తడి ఆరిపోయింది. మాట్లాడటమే కష్టమనిపించింది.

"ఇమ్మని చెప్పింది నీకే!" అన్నాడు ఎల్లాగో.

భార్య ఇంకా కదలకపోవటంచూసి, తూలుతూన్న శరీరంతో లేచివెళ్లి, పెట్టెలోని కరెన్సీనోట్ల కట్టల్ని తెచ్చి వదినగారి ఎదుట నిలబడి ఆమెకు అందిచ్చాడు. ఆమె అగమ్యగోచరంగా అతని ముఖంలోకి చూసింది. ఆమె ముఖంలోకి చూసే ధైర్యం అతనికి కలగలేదు. ముఖం వంచే మాట్లాడుదామని గట్టి ప్రయత్నంమీద నోరు తెరిచాడు. కాని ఆనోటి వెంట మాటలు రాలేదు; నెత్తురు వచ్చింది; దాంతో అతని శక్తులన్నీ యీలోకంలోని పనుల్ని మానుకున్నయ్. అతని శీతల శరీరం నేల వ్రాలింది.

వదినగారికి మాత్రం—మరిది, సంధివల్ల మరణించాడనే ఇప్పటికీ నమ్మకం!

—నవంబరు, 1941

# విషమ పరీక్ష

"నిండు ముఖంతో ఉల్లాసంగా లోకాన్ని చూసి నవ్వుతూ, మేఘాల్లో ఆటలాడుకుంటూ— పరుగెత్తుకు పోతూన్న ఆ చందమామ మన కోసమే—కదూ ?" సుభద్ర మాట్లాడ కుండా గంభీరంగా అనంతాకాశంలోని శశి సౌందర్యాన్ని చూస్తోంది.

"జీవితమంతా నువ్వూ, చంద్రుడూ, ఐతే—?" అర్థోక్తి లోనే ఆగి, వేణు ప్రశ్నార్థకంగా ఆమె ముఖంలోకి చూశాడు.

అమాయకంగా లోలోన నవ్వుకొని ఆమె అంది: "ఇప్పు డల్లాగే అనిపిస్తుంది—"

"ఎప్పుడూ ఇల్లాగే అనిపిస్తుంది; నిద్రావస్థలో, జాగ్రదా వస్థలో— ఊహల్లో, పోహల్లో, అన్నిటా నువ్వే ఆక్రమిం చావ్ ... ఇతర్లకు ఇందులో తావులేదు. ఎప్పుడూ నువ్విలా నాపక్క-నే ఉంటే ...?"

"ఏంచేస్తారు ?"

కొంటెగా నవ్వి అన్నాడు: "ఏంచేస్తానో? ఇల్లా హృద యానికి హత్తుకొని— మెరిసే నీకళ్ళల్లోంచి నీహృదయాన్నీ, ఆత్మనూ చూస్తూ వాటిని నావిగా చేసుకునేందుకు నాశక్తి నంతటినీ వినియోగ పరుస్తా. నేను నువ్వుగామారి, ఏకమై, ఐక్యమై నీలోకలిసి కరిగిపొయ్యేందుకు ప్రయత్నిస్తా"— ఉద్రేకంతో ఆమెను దగ్గరకు లాక్కొన్నాడు.

కొన్ని నిమిషాలవరకూ వారిభౌతిక శరీరాలు నీలా కాశంకిందఉన్నా—వారి హృదయాలూ, ఆత్మలూ పైదో

డుగా ఏవో సౌఖ్యమయ ప్రపంచాల్లో విహరించినయి....
గడచిన క్షణాల్ని గుర్తించుకోకుండానే వారిలోకపు
వ్యక్తులై—ఒకళ్ళ కళ్ళ నొకళ్ళు ప్రశ్నించుకుంటూ వింత
నవ్వొకటి నవ్వుకున్నారు.

"సుభా! ఇద్దరమూ దంపతులమైతే?" మాట మధ్య
లోనే అందుకొని ఆమె అంది: "మీకు ఎప్పుడూ ఇదేగోల!
ఇప్పుడుకామా? లోకందృష్టిలో, సంఘందృష్టిలో కాక
పోతే మాత్రమేం?"

"అదికాదు సుభా! నన్ను సరిగ్గా అర్థం చేసుకో; ఇద్దరి
మధ్యా ఒక శాశ్వతసంబంధ మేర్పడాలి. అప్పుడుకాని నీకు
గౌరవం ఉండదు. ఆలోచించు: నువ్వొక ధనికుడి భార్య
వంటే నీ కీ ప్రజలిచ్చే ఉన్నతస్థానాన్ని—"

"నాకా? నాకా?" అని వికటంగా నవ్వి అంది: "నాకు
పిచ్చి భ్రమలు పెడుతున్నారు. మీరొకరుండుంటే నాకిం
కేమీ అక్కర్లేదు. నా కెందుకీ మనుషుల ముఖస్తుతులు?
నాలోలేని విలువను నాకు ఆపాదిస్తున్నారు. నాకు కులం
లేదు; గోత్రం లేదు. ఎవరికీ, ఎప్పుడూ, ఎందుకూ పనిరాకుండా
పడివున్న నన్ను ఏరుకొచ్చారు; మీరుమాత్రమే నాకిచ్చే
గౌరవంతో నేను తృప్తిపడగలను. ఎన్ని పుణ్యక్షేత్రాలు
దర్శించి, ఎన్ని గంగాస్నానాలుచేసినా పంది నందికాలేదుగా!
సాంఘికంగా వివాహానికి విలువఉండొచ్చు. కాని నీతికీ, ఆ
విలువకూ ఉత్తర దక్షిణధృవాలకున్నంత దూరంవుంది.
ప్రేమకు వైవాహికజీవితమే అవసరమా? నేను లోకం
ఎదుట మీకు భార్యనై ఇంతకన్న ఎక్కువ ఆనందాన్నివ్వ

గలననే నమ్మకం నాకు లేదు."

కొంతసేపు బాగా ఆలోచించి అన్నాడు: "కాదుసుభా! నాకష్టాల్లో సుఖాల్లో—అన్నింటాలోనీకు సమభాగం కావాలి; అర్థాంగివైతే ఎంత సులభంగా వీటిని సంపాయించొచ్చు—?"

"ఇంతకు మించిన అధికారం నాకొద్దు. బతకటానికి అవసరమైనంత డబ్బే నాకు చాలు. మీ ధనాన్ని తినే ఇంతమంది జనంలోనూ నేను కూడా ఒకతెనౌతాను. నామాటవినండి... మీరు ఏదో బాధకు అనవసరంగా గురౌతున్నారు."

"సుభా నువ్వు నాకు శాశ్వతంగా కావాలి. 'నా' అనుకునే వాటిల్లో నువ్వొకతె వవాలి..." తన హృదయాన్ని విప్పి చెప్పగల భాష ఇదేనని అతను గాఢంగా నమ్మాడు.

"ఔతాను—ఎప్పటికీ మీదాన్నే ఔతాను. దానికి వివాహబంధమేనా అవసరం? ఆ సంస్థమీద నాకు నమ్మకం లేదు. నాలోని సంస్కారంతో, విశ్వాసంతో, జీవితాంతం వరకూ మిమ్ము నా స్వామిగా ఆరాధించగల నేనే నమ్మకం నాకు వుంది. నామీద మీకు లేదూ?" ఆచివరి ప్రశ్నకు ఆమెకంఠంలో దీనత్వం స్ఫురించింది.

నమ్మకం! ఇది లేకపోతే ఆమెను తను చేరదీసేవాడేకాదేమో? వేణునవ్వి, "అది లేకపోతే ఇంతవరకూ ఇద్దరమూ కలసి ఉండేవాళ్లంకాదు—" అన్నాడు.

"ఆ నమ్మకాన్నే వృద్ధిపరుచుకోండి. ఇల్లా గడిచిపోయే కాలమే మనను ఇంతకన్న గాఢంగా బంధిస్తుంది..."

నిశ్చలంగా అతను క్షీణకాంతుల్తో పశ్చిమాద్రిని ఎగబాకుతూన్న చందమామలోకి చూడసాగాడు.

గట్టిగా గాలివదుల్తూ ఆమెఅంది: "నేనురాణించినా క్షీణించినా మీరేగా నాకుదిక్కు! ఈఅనాథకు ఇంకెవరున్నారు...?"

ఆమెగాయపడ్డదని నొచ్చుకొని, ప్రసంగాన్ని మార్చుతూ వేణు, "లేదులే—సుభా! నీకు నేనూ నాకు నువ్వూ—ఈ జీవితాంతంవరకూ—మనది ఏకప్రాణి—అవునా ?" అన్నాడు.

"ఊఁ" అనిఆమె అంతర్వాణి సన్నగా పలికింది.

# 2

సుభద్ర జ్వరం వేణులో చలనం కలిగించకపోలేదు. డాక్టర్ కృష్ణారావుమధ్యా తనమధ్యా ఆ చిన్ననాటి స్నేహం ఏరహస్యమూ లేకుండా చేసింది.

"సుభను ఒక కంటకాయాలి. రెండు మూడురోజులదాకా నేనుఊళ్ళోఉండను. ఆమె నా ప్రాణసమానం! ఇప్పుడు నా కామెను చూసే వ్యవధికూడా లేదు—" నవ్వుతూ తలవూపిన స్నేహితుడి భుజాన్నితట్టి—వేణు స్టేషన్‌ముఖంపట్టాడు.

ఆ రెండురోజుల జ్వరం మశూచికానికి 'నాంది' అయింది. తన వ్యాధిని తెలుసుకొని సుభద్ర ఒణకక, తొణకక తనలో తనువికటంగా నవ్వుకొంది. ఆమె సేవకై ప్రత్యేకంగా నియమింపబడ్డ ఇద్దరు దాసీలూ తమ లోపంలేదని చాటుతూనే ఉన్నారు.

డాక్టర్ వచ్చినప్పుడల్లా మెల్లిగా కన్ను తెరిచి, బాధగా చూస్తూ, "వారొచ్చారా?" అనేది.

"లే-దు." ఆమెకు ఆప్రశ్న, డాక్టర్‌కు ఈ జవాబూ

కంఠోపాఠ మైపోయ్యాయ్—ఈ ఐదురోజుల్లోనూ!

ఆమె ప్రియుడిరాకకోసం ఆతృతపడజొచ్చింది; డాక్టరుకు ఆమె ఆరోగ్యాభివృద్ధినిగూర్చి ఆతృత అధికమైంది.

వేణురాగానే డాక్టర్ నవ్వుతూ, "ఆమె నీకోసం ఎదురు తెన్నులు చూస్తోంది" అన్నాడు.

"ఆమె కెల్లా ఉంది?"

"మ—శూచికం! ఒక మాదిరిగాఉంది—"

డాక్టర్ ఉచ్చారణ తగ్గుస్థాయిలో ఉన్నా వేణును భయ పెట్టింది. అతనిహృదయంలో రేకెత్తిన తుపాను లక్షణాల్లో అధికభాగం ముఖంలోనే ముద్రితమయ్యాయ్. ఊహాప్రపంచంలో రోగిష్టిమంచాన్నీ, ఆవ్యాధితో బొబ్బలెక్కిన శరీరాకృతితో బాధపడే రోగినీ సృష్టించుకొని కలవరపడ్డాడు. తను అధికానురాగంగా ఆరాధించిన ఆ సౌందర్యమూర్తి ఈనాడు మహామ్మారీ కరకు కోరల్లోపడి నలిగిపోవటం తలచుకోలేక పోయ్యాడు. ఆమె వికృతరూపంతో తన ఎదుట నిలబడ్డట్టుంది— అతని కళ్లు శూన్యంలోని కాల్పనిక వికారాకారాన్నికూడా చూడలేక ఒక్కసారిగా కొన్నిక్షణాలవరకూ మూసుకొన్నాయ్.

విషాదగాత్రంతో అన్నాడు: "ఇప్పుడామె ఎక్కడుంది?"

"ఆ—అద్దెకొంపలోనే! చూద్దుకానివి—వెళ్దామా?"

"నేనా? నేనా?" అని వికారంగానవ్వి అన్నాడు: "నేను రాలేను—కాదు; రాలేదనిచెప్పు—"

"అబద్ధందేనికి? ఆమె నీకోసం కలవరిస్తోంది"

"ముందు నాకుచెప్పు— కృష్ణా! ఆక్రిమి అంటకుండా

వుండేందుకు ఈ లోకంలో ఉన్న రక్షలు—"

డాక్టర్ హేళనగా, పెద్దగా నవ్వాడు. "ఫినాయిల్ తాగేయ్ ఉదరగోళమంతా శుభ్రంగా క్లీన్—క్లీన్ అయిపోతుంది—"

"నవ్వులు కాదు—నిజం చెప్పు—"

"ఇదేనా నీ భయం? మరేం ఫర్వా లేదు. ముందు జాగర్త పడ్డాకనే వెళ్దాం లే"

చేతికి ఉన్న టీకాల్ని చూచుకొన్నాక వేణు బుర్రతిరుగుడు వేగం కొద్దిగా తగ్గింది. కాస్తఆగనిట్టూర్చి వేణు, "నేను రాను కాని—" అన్నాడు.

"ఇంత భయమైతే ఎట్లా?"

"భయమో—గియమో! ఎవరి ప్రాణం వాళ్ళకు తీపి—"

"ఇదేం ప్రాణగండం కాదు లే! మేము మందులిచ్చే వేషాలు వేసుకొన్నా మానవులమేగా! మాకు మాత్రం వుండదూ ప్రాణంమీద తీపి?"

"కాదనను-కాని మీకుఅలవాటైపోయింది. ఆపరేషన్లకు కూడా చలించని మొండిగుండెలున్న వాళ్లు మీరు. మీకు హృదయాలున్నా వాటిపైన తాబేటి డిప్పలున్నాయ్! ఇదంతా ఎందుకు? నేను మాత్రం రాదల్చుకో లేదు—"

"వేణూ! ...పొరపడుతున్నావు! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డమెయ్యనూ? ఆమె కళ్లు కాయలుకాచేటట్టు నీకోసం వేచి కూర్చొంది."

"ఏమన్నా అవనీ—నేను రాను—"

* * * *

"ఇవ్వాళ ఏమన్నా నయంగా వుందా?"

"లేదు; అంతకంతకు ప్రమాదావస్థలోకి లాగుతోంది. ఇది ప్రాణగండమనికూడా నాకు తోస్తుంది."

కళ్లుమూసుకొని వేణు, "ఆమె జీవించకూడదనే దేవుణ్ని ప్రార్థిస్తా—"అన్నాడు.

డాక్టర్ను ఆశ్చర్యమూ, అయోమయమూ ఉక్కిరి బిక్కిరి చేసాయ్. "ఏమన్నావ్?—ఆమె జీవించటం కూడా నీకు ఇష్టంలేదా? ఇదేనా నువ్వాల్సినమాట? డాక్టర్లకుకాదు హృదయాలు లేంది—నీలాంటివాళ్ళకు."

వేణు నవ్వి అన్నాడు: "ఆమె జీవించి ఏం ప్రయోజనం? ఎవర్ని సంతోషపెట్టగలదు? ఆమె మృతువు పాలయితే చాలా అదృష్టవంతురాలౌతుంది—"

"నీ నిఘంటువులో 'సానుభూతి' అనే పదం కూడా లేనట్టుంది. కాపు కాయంగానే నరికేసే అరటిచెట్టులాగు— ఆమెను చూస్తూన్నావ్. ఆమె దీనావస్థచూస్తే నాకే జాలేస్తోంది; నువ్వొచ్చావని చెప్పా; ప్రాధేయపడ్డది, ప్రార్థించింది: నిన్నొకసారి రమ్మని. ఈనాటితో ఆమె ఆయువుకూడా సరేనేమో! ఒకసారిరా—"

"ఇప్పుడొచ్చేందుకు వీల్లేదని చెప్పు—"

## 3

మెల్లిగా కళ్లు తెరచి, ఎండిన పెదవుల్ని నాలికతో తడిచేసుకుంటూ ఆమె అడిగింది: "రానన్నారా?"

డాక్టర్ చూసిన నేలచూపుల్లో ఆమెకు నిరాశాజ్యోతి

స్ఫురించకపోలేదు. వేటకాని అంబుకు గురైన ఓమాయకపు లేడిలాగుచూస్తూ ఆమెఅంది: "వారితో చెప్పండి: నేనింక ఎక్కువకాలం బతకనని. గతిలేని నన్ను చేరదీసి, నాజీవితంలో లోటులేకుండా— చేసుకున్న భార్యకన్న ఎక్కువ ఆదరంతో చూసిన ఆయన్ను— యీ జీవితానికి కడసారి చూసి, కృతజ్ఞతా పూర్వక నమస్కారంతో మృత్యుదేవతను నాకు నేనై ఆహ్వానించుకుంటాను. ఆయనకే నేను అనవసరమైతే—మీలాటి పరాయివాళ్ళకేం అవసరం నాకు సానుభూతి చూపటానికి? వారికి హాని చేద్దామనికాదు; వారు నన్ను తాకనక్కర్లేదు; ఈగదిలోకూడా ప్రవేశించనక్కర్లేదు. అక్కడ—ఆవాకిలిదగ్గర, ఒక్కనిమంసేపు నిలబడితే చాలు. ఈకోర్కెను చంపుకుందామన్నా, ఇంకా పోని యీకళ్ళకు అది సాధ్యమవటంలేదు..... వారికోసం రక్తస్పర్శవున్న ఆత్మబంధువుల్నీ, ప్రాణస్నేహితుల్నీ కూడా వదులుకొని, ఆయన పాదాల దగ్గరే నాజీవిత సర్వస్వాన్నీ ఉంచాను. ఆపాదాలే నన్ను తంతే—నాకింకదిక్కేది? ఈనాడు దిక్కులేని చావుకు గురౌతూంటే— యీలోకంనుంచి విరమించే ప్రతి ప్రాణీ కోరే—సానుభూతి కన్నీటికే నేను నోచుకోలేదా? ఈ అంటువ్యాధిని ఆహ్వానించుకున్న నేరం నాదా? వారు నా జీవితానికి తోడునీడై ఉంటారని గట్టిగా నమ్మబట్టేగా— యీనాడింత దుఃఖానికి గురవటం—?"

మాటలింక చెప్పలేక కళ్ళురెండూ నీళ్ళతో నింపింది. డాక్టర్ హృదయం ఆ అనాధ ప్రాణిపై అపారమైన జాలితో నిండింది.

డాక్టర్‌కు నమస్కరిస్తూ ఆమె "డాక్టర్‌గారూ! మీపా దాలమీద పడతాను: మీరు వారికి ప్రాణస్నేహితులు— శ్రమ అనుకోకుండా తుదిసారి వారిని ఇక్కడకు తీసుకొచ్చేం దుకు ప్రయత్నించండి—నాకు ఏ బాధా లేదు—వారిని చూడాలనే కోరిక—తప్ప! ఒక్క చూపేగా నేను కోరింది" అని శూన్యదృక్కుల్తో గదిని పరికించింది.

డాక్టర్ లేచి నిలబడి "ప్రయత్నిస్తానమ్మా—" అన్నాడు; ఆమె కృతజ్ఞతా పూర్వకంగా డాక్టర్ వైపుచూసింది.

* * * *

"ఇప్పుడామె మృత్యుముఖంలో వుంది. ఈ చివరిసారి చెప్తున్నాను వేణూ! ఒక్క చూపుకు మాత్రమేగా ఆమె అనర్హురాలైంది? ఒక్కసారి వెళ్దాంపద. ఆమె మృతశరీరానికి నువ్వుకార్చే కన్నీరు అనవసరం—తరువాత పశ్చాత్తాపపడి కూడా లాభముండదు—"

ఆమె మాటలన్నీ చెప్పి, అన్నాడు: "ఇది ఆమె తుది సందేశం! దీన్ని పాలించుటం నీవిధి! ఆమె నీకు చేసిన త్యాగానికి నువ్వీమాత్రం కృతజ్ఞతను చూపాలి. నిన్ను ఇన్నాళ్ళు ఆనందడోలికల్లో ఊపినవ్యక్తి ఈనాడు నీకు శత్రువైందా? నీ ప్రవర్తన నాకే అగమ్యగోచరంగావుంది. నీ హృదయం సంస్కరింప బడ్డదనుకొన్నా. నీలో ఏ పశువు పనిచేస్తోందో నాకర్థ మవటంలేదు... లే-వెళ్దాం-ఆమె ఇంకా కొద్దినిమిషాలు మాత్రమే ఈలోకంలో ఉంటుంది."

వేణుకు గత జీవిత చరిత్రంతా కళ్ళముందు కట్టినట్టయింది.

ఆ దినాల్లో ఆమె తననెంత సుఖపెట్టింది! ఆమెకు తనహృదయంలో ప్రత్యేకించిన అత్యున్నతస్థానాన్నికూడా నిరాకరించి తన పాదదాసిగా పరిగణించుకొని సేవచేసింది! ఇప్పుడు...? ఆ వ్యాధి! అంతకన్న పాపంచేసుకొన్న వ్యక్తులు లోకంలో ఉండరని తను నమ్మాడు-అసలు ఆ తలపులే తనను పిచ్చివాడుగా చేస్తున్నయ్. ఆవలి గట్టులేని ఆలోచనా సాగరంలో అతని ఊహాలన్నీ ఒకే నిశ్చయాన్ని సూచిస్తున్నయ్. తన ప్రియురాలి తుదికోర్కెలను చెల్లించలేని తన అసమర్థతను దూషించుకొన్నాడు; చెదరిన హృదయంలోంచి వెలువడ్డ కన్నీటి బిందువులు కళ్లనుంచి బైటపడినై. అది హృదయ పరివర్తనని భ్రమపడ్డ డాక్టర్, "వెళ్దాం-" అన్నాడు.

"నేను రాను—ఎందుకు రాలేనో నాకే తెలియదు—"

"మానవుడివి చావుకు భయపడతున్నావ్—"

"నాకు చావంటే భయంలేదు. కాని మృత్యుదేవత ఈ ఒకర్-రూపంలో కన్పిస్తే మాత్రం నాకు భయమే!"

"పిరికిపందవు-జీవితంలో దేన్నీ తలకిందులుగా తపస్సు చేసినా సాధించలేవు—" స్నేహితుడి చనువును ఊతగా తీసుకొని, అతన్ని బాధించి, నొప్పించటానా ఆమెకు చూపాలనే గట్టి పట్టును డాక్టర్ వదల్లేదు. కాని వేణు మౌనాన్నే సమాధానంగా సూచించాడు.

"ఇంత దుర్బలహృదయుడి వనుకోలా-కృతఘ్నుడివి. ఆమె నీ ధర్మపత్ని అయినా, తల్లయినా, తండ్రిఅయినా, ప్రియపుత్రుడైనా, ప్రాణస్నేహితుడైనా—ఇదేగా నువ్వు చూపే సానుభూతి?"

"ఏ—మో !"

"రేపు నువ్వు ఇదేవ్యాధికి గురైతే—మేమందరమూ నీ దగ్గరకు వచ్చేందుకు నీలాగే భయపడితే-నువ్వేలా బాధపడతావ్ ?"

"నాకు తెలియదు"

"నేను ఎన్నిసార్లు ఆమెగదిలోకి వెళ్ళా—నన్నంటనిది నిన్ను అంటుతుందా ?"

"నేను—నువ్వు కాదుగా !"

"నీలాంటి పాషాణహృదయాలు లోకంలోఉన్నారనుకోలా-రావా ?"

"రా-ను"

డాక్టర్‌కు కోపంవచ్చింది "ఆమెనూ-ఆమె హృదయాన్నీ ఆత్మనూకూడా గాయపరచావు ! నీ జీవితచరిత్రలో ఇది తీరని కళంకం! నీలాటి వాళ్లనుగుర్తించి నలుగురూ నవ్వుతారనన్నా ఉండాలి."

ఈ మాటలుకూడా వ్యర్థమై గాలిలో కలిసిపోయాయ్. వేణు చేతులుపట్టుకొని డాక్టర్ అన్నాడు, "ఇది నాకోర్కెగా చూడు. వాకిలిదగ్గర నిలబడి తిరిగిరావొచ్చు-ఆమె నిన్నంతకన్న ఎక్కువ కోరలేదుగా!"

"అదినాకు చాతకాదు"

ఇవన్నీ గడుసు సమాధానాలని తలచిన డాక్టర్-వేణును గట్టిగా పట్టుకొని జరజరా లాక్కుపోతూ, "బలవంతానలాక్కుపోతా-" అన్నాడు.

వేణు డాక్టర్ పట్టుతప్పించుకొనేందుకు వ్యర్థప్రయత్నం

చేసి, అతను బంధించిన హస్తాల్ని పట్టుకొని వేళ్లాడుతూ, "నన్ను వదులు-కృష్ణా! నువ్వు నాస్థితిలోవుంటే తెలిసేది-" అన్నాడు సీరియస్‌గా!

డాక్టరుకు అసహ్యంపుట్టింది. వేణు చేతుల్ని విసిరికొట్టి, "నువ్వొక విచిత్రవ్యక్తివి." అన్నాడు.

గంభీరంగా చూస్తూ వేణు, "ఆమెతో చెప్పు నన్ను క్షమించమని; ఆమెను ఇంకా ప్రేమిస్తున్నానని" అన్నాడు.

"మాటల్లో మాత్రమే-!" అని, ఆ అమానుషప్రాణిదగ్గర నిలబడలేక, డాక్టర్ నేలను గట్టిగా కాలితో తన్ని చురచుర చూస్తూ, వెళ్లిపోయ్యాడు.

# 4

డాక్టర్ ముఖంలోని నిరాశనుగుర్తించి ఆమె తలవాల్చి, "రానన్నారా?" అంది.

"రా-డట!"

ఇతంతా మరిచిపోదామని గట్టిగా కళ్లుమూసుకుంది; కాని బాధను ఎవరు మరిచిపోగలరు?

నిరాశతో నిట్టూర్చి హృదయావేదనంతా ఇమిడే క్షీణస్వరంతో ఆమె అంది: డాక్టర్‌గారూ! నా పాలికేళ్ల బతుకూ ఈనాడు బైటపడ్డది! ఈ పదేళ్లూ అర్థంకాని ఒక వ్యక్తి నాకీ మృత్యుముఖంలో అర్థమయ్యారు! నేను కనిన కమ్మని కలలన్నీ ఈనాడు భ్రమగా తేలినై! నా జీవితమే వ్యర్థమైంది: ఈ నాడు వారు నాకు విధించిన ఈ అమానుష కఠినశిక్ష భరించలేనిది! వారింకా ఎన్నారనే ఆశతోనే ఇంత

సేపూ పోయ్యే ప్రాణాల్ని పట్టుబలవంతాన నిలుపుకు కూర్చున్నా. పోనీండి-"

ఎడారి వేడిలో మాడుతూ, దాహానికి పీకార్చుకుపోయి- దూరాన కన్పించే ఎండమావుని చూసి భ్రమించి-ఇంకా శరీరంలో మిగిలిన కొద్దిశక్తినీ వినియోగించి పరుగెత్తి, మోసానికి గురై, నిరాశతో కృంగిపోయిన పాంధుడిలాగు ఆమెచూపులు కాంతిహీన మయినై. ఒకసామాన్య మానవహృదయం భరించలేని దుఃఖాగ్ని ఆమెహృదయగోళంలో పెద్దగా ప్రజ్వరిల్లింది. కొన వూపిరిని కూడదీసుకుంటూ మాటల్ని ఏర్చి కూర్చుకుని, "ఈకోరిక ... వారిని-గాయపరిస్తే....నన్ను ... క్షమిం—చ మని చెప్పండి—" అంది.

క్షణక్షణానికీ క్షీణిస్తూన్న కాంతిని ప్రసరింపజేసే ఆమె కన్ను లింక ఈ ప్రపంచాన్ని చూచేశక్తిని కోల్పోయాయి. గోడవైపు తిరిగి కడసారి గాలిని పీల్చేందుకు వ్యర్థప్రయత్నం చేసి—ఆమె నిద్రాదేవి కౌగిట్లోకి శాశ్వతంగా ఒరిగింది.

* * * *

"ఆమె పోయింది—" వేణు మౌనంతో అనంతశూన్యంలోకి చూడసాగాడు.

"వచ్చి—చూడు"

"రా-ను"

"ఆమె జీవించి నీకు చేసిన హానికన్న ఇప్పుడేమీ ఎక్కువ చేయదుగా!"

స్నేహితుడి రెండు చేతుల్నీ పట్టుకొని వేణు అన్నాడు: "ఈ దుర్బలత్వమేమిటో నాకే అర్థమవదు; దాన్నివిప్పి చెప్పు

కునేందుకు నా భాష చాలదు. ఆమెను వీలైనంత త్వరలో కాటికి జేర్చు—"

"నువ్వు రాక్షసుడివి-"

వేణు కన్నీరు కార్చాడు; అతని హృదయాంతరాళంలో పొంగిపొరలే అంతులేని, పంతులేని విచారవాహినిని చిక్క బట్టుకుంటూ, "అవనీ కృష్ణా! నేను ఆ ప్రాంతాలకు రాలేక పోయినా-ఆమెను ప్రేమించాను. ఆమెకోసంమాత్రమే నేను ఇన్నాళ్లూ కష్టాల్ని ఎరుగను. ఇప్పుడుకూడా ప్రేమిస్తున్నా".

"కాదు-మిన్నూ మన్నూ ఏకమైనంతగా ఆమెను మదోన్మాదంతో కామించావ్; మోహించావ్; ఆమె ఆత్మనే వంచించావ్. ఆమెనొక యంత్రంలాగా వాడుకున్నావ్-అది నీకు పనికిరానినాడు, దాన్ని లెక్క చెయ్యలేదు. ఆమె ఆత్మ శాంతి లేకుండా-తీరని ఒక్క కోరికతోనే నీపాదాలకిందపడి నలిగిపోయింది. ఆమె బూడిదైనా నీకు లక్ష్యంలేదు.— ఇదే నా ప్రేమ?"

వేణు నిట్టూర్చి అన్నాడు: "నిజం కృష్ణా! ఈమాటలు నా హృదయంలోంచి వస్తున్నాయ్. నేనామెను అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీకూడా ప్రేమిస్తున్నాను-"

"నీది ప్రేమకాదు.-ప్రియురాలికోసం ఏమీ, ఏదీ త్యాగం చెయ్యలేని నువ్వు ప్రేమకు అనర్హుడివి. నీ ప్రేమను నీకు నువ్వే రుజువు చేసుకోలేకపొయ్యావ్-"

"కాని, ఇది నాలాంటి సామాన్య మానవప్రాణికి అసాధ్యమైన, అతీతమైన విషమ పరీక్ష!" అని వేణు చిన్న కుర్రాడి లాగు వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. —అక్టోబరు 1940.

# మనిషి

ఎన్నాళ్ళనుంచో ఆవిషయం వాణ్ని అడిగి తెలుసుకోవా లనుకుంటూ ఉండేవాణ్ని. పెళ్ళి అయినప్పటినుంచీ, ప్రభా కరంలో ఏదో వింతమార్పు కనిపించింది. మరీ భార్య కాప రానికి వచ్చాక, ఏదో అసంతృప్తి మాత్రం వాడి ముఖంలో స్పష్టంగా కనిపించేది. సంసార జీవితంలో మొదట్లోనన్నా కనిపించే ఉత్సాహం వాడిలో ఎంత వెతకినా కనిపించక పోవటం నాకు ఆశ్చర్యకరమే అయింది.

నేను ఊహించ గలిగినన్ని కారణాల్ని ఊహించాను; వాడి పరిస్థితులన్నీ ఒకటికి పదిసార్లు పరామర్శచేసుకు చూశాను. కాని ఏ ప్రత్యేక కారణం వాణ్ని యీస్థితికి లాగు తోందో నాకు అంతు పట్టలేదు.

"ఎందుకూ ఎప్పుడూ దిగులుగా ఉంటావ్ ?" అన్నాను, ఒకనాడు. ఇక ఊహించి లాభం లేదనీ, వాణ్ణే అడిగి తెలుసు కోవటం కన్న వేరు మార్గం లేదనీ నిశ్చయించుకొన్నాను.

"ఏమీ లేదు..—" అని తప్పించుకోవాలని చూశాడు.

నేను అంతలో వదలక "సరిగ్గా చెప్పు. ప్రతి జీవితానికీ ఏదో వొకలోటు ఉండనే ఉంటుంది. కాని, కొన్ని సమస్యల్నీ లోపాల్నీ సర్దుకునే అవకాశం కూడా ఉంటుంది. నీకు నువ్వే ఏదో బాధగా ఉండటం నన్నుకూడా ఒక విధంగా బాధిస్తూనే ఉంది." అన్నాను.

వాడు ఏదో అనుమానంగా నాకళ్లల్లోకి చూసి, తరువాత నిశ్శబ్దంగా ఆకాశం వైపు చూడ సాగాడు.

"నాదగ్గర దాచాల్సినంత పెద్దకారణమా?" అన్నాను.

"ఊహుం." అన్నాడు, వినపడీ వినపడనట్టుగా.

"ఇంక చెప్పరాదూ? ఏదన్నా ముందుందేమో /వెతకేం దుకు నేనూ సహాయపడతానుగా?" అని ధైర్యం చెప్పాను.

కాస్త ఆగి మళ్ళీ "కానీ...చెప్పు—" అని హెచ్చరిం చాక, చెప్పేది తను కాదన్నట్టు వేరొక దిక్కు చూస్తూ, "ఏంలేదు. నాభార్య విషయం—" అని ఆగాడు.

ఏం? వాడి భార్యకేం? అందమైనదే! పెద్దింటినుంచి వచ్చిందికూడా. నలుగురితోనూ భుజాలుకలిపి తిరగగలిగే చాకచక్యం ఆమెలో లేకపోయినా, ఎవర్నీ నొప్పించకుండా తన పనేదో చూసుకుపోగల మనిషి. ఆమె అణకువ చూస్తే ఉత్తమ ఇల్లాళ్ళలిస్టులో జమవెయ్యాక తప్పదు. విశేషించి ఆమె మాకు దూరపు బంధువుకూడాను. నేను విన్నంత వరకూ, నాకు తెలిసినంతవరకూ ఆమె చాలా మంచిది. ఇంక వీడు చెప్పేదేమిటి?

"నీభార్యకేం?" అన్నాను, మామూలు ధోరణిలోనే.

వాడికి కాస్త ధైర్యం వచ్చిందనుకుంటాను; గొంతు సవ రించుకొని "అదేం ఖర్మమో కాని ఆపెళ్ళయిన నాటినుంచీ నాకు చెడ్డరోజులేరా!" అన్నాడు.

"అంటే?" అన్నాను, అర్థమవక.

"పెళ్ళయిన సంవత్సరమే—ఎన్నడూ తప్పి ఎరగని నాకు బి.యే. పరీక్ష పోయింది..." ఆగి, నాముఖంలోకి చూశాడు, సరిగ్గా ఆమాటల్ని జీర్ణించుకున్నానో లేదో నన్నట్టు.

నవ్వాలో ఏడవాలో నాకు తెలియలేదు. వెంటనే పట్ట

రాని కోపం వచ్చినా, సామ్యవాదంచేసి వాణ్ణి ఒప్పించాలనే పట్టుదలవల్ల, ఏభావాన్నీ వ్యక్తీకరించలేదు.

"ఐతే, పరీక్షపోవటం ఆమె తప్పేనంటావా?" అన్నాను.

"అనను... మొదట్లో నేనూ అట్లాగే సరిపెట్టుకున్నాను"

"మరి?"

"చెప్తే నమ్ముతావో లేదో కాని... ఆనాటినుంచే కుటుంబానికి అరిష్టం చుట్టుకుంది. ఐదు సంవత్సరాలనుంచీ కోర్టుల చుట్టూ తిరుగుతూ, అంతులేకుండా డబ్బు ఖర్చు పెడుతూ, తప్పకుండా గెలుస్తామనుకుంటూన్న దావా కాస్తా పోయి పాతికవేల ఆస్తికాస్తా క్షవరమైపోలా?"

"అందుకు ఆమె బాధ్యత ఏముంది?"

"లేకపోవచ్చు. కాని కొన్ని జాతకాలుంటయ్యే—మనిషి బతుకును అధోగతికిలాగేస్తయ్. భార్యజాతకం భర్తకు అనువర్తించటాన్ని ఏనాడో పెద్దలేరాసిపెట్టారు. మొదట్లో నేనూ వీటిని నమ్మేవాణ్ణికాదు......కాని జీవితంలో ఇంతగా బాధపడుతూ, ఇన్ని దృష్టాంతరాలు కనిపిస్తూంటే ఇంకా ఎల్లా నమ్మకుండా ఉండగలను?"

"ఇంకా?" అన్నాను, వాడిధోరణిని ప్రోత్సహిస్తూ.

"ఆమె కాపరానికి వచ్చి ఇంట్లో కాలుపెట్టింది...నాయనా, ఎన్ని అవస్థలు పడాలో అన్నీ పడుతున్నాం. రావాల్సిన బాకీలురావు; ఇవ్వాల్సినవి ఆగవు...ఎంత పలుకుబడితో ఉద్యోగానికి ప్రయత్నం చేసినా నిష్ప్రయోజనమౌతోంది—"

ఇంక లేనా జీవితంలో అపజయాలు? తన ప్రయత్నాలూ, తన తప్పులూ, తన అదృష్టమూ ఎందుకు వీడు ఇతర్ల మీాదికి

తోస్తాడు? ఇంక ఆపకపోతే వీడి ధోరణికూడా ఆగేటట్టు లేదు.

"పెళ్ళినాడు ఐదువేలకట్నం తీసుకురాగలిగినప్పుడు ఆమె అదృష్టవంతురాలేగా?" అన్నాను.

"కాదురా—" అన్నాడు.

"పోనీ, నీ దురదృష్టమే ఆమె అదృష్టాన్ని పాడు చేసిందని ఎందుకనుకోవు?"

"ఎట్లా? ఇదివరకు నాపరిస్థితులన్నీ ఆమె రాకతో తారుమారయినయ్... నీకు అర్థమవదు. పొద్దున్నే లేచి ఆమె ముఖం చూస్తే చాలు—ఆనాడు విధిగా అవ్వాల్సిన పనులు కూడా ఎదురుతిరుగుతయ్—"

"నీ నమ్మకం అపాయపు పొలిమేరలు దాటుతోంది—"

నేను నవ్వటం మొదలు పెట్టాను. వాడికి కోపంకూడా వచ్చిందనుకుంటాను.

"పైవాళ్ళకు నవ్వులాటగానే ఉంటుంది. నాకు తెలుసు—యీ కారణాల్ని ఎవ్వరూ నమ్మరని; పైపెచ్చు నన్ను ఎగతాళి చేస్తారనికూడా ఎరుగుదును. అందుకనే ప్రాణస్నేహితుడివైనా ఇన్నాళ్ళూ నీకు చెప్పకుండా దాచాను. తీరా చెప్పాక- ఎందుకూ ఆనవ్వు?"

వాడి కోపానికి నానవ్వు భయపడ్డది.

"నువ్వు నాస్థితిలో వుంటే అర్థమయ్యేది" అన్నాడు.

ఇంక వాడితో యీవిషయాన్ని వాదించటంకన్న, మానుకోవటమే అప్పటికి మంచిదిగా కనిపించింది. ఇంతవరకూ జరిగిన సంభాషణను మరిచిపోయినట్టుగానే నటిస్తూ, ప్రస్తావనను

మార్చి, ఆ సాయంత్రానికి విడిపోయ్యాము.

కాని ప్రభాకరాన్ని చూసి జాలిపడ్డాను. ఎంత ఆలోచించినా ఆ జాలిని ఎల్లా వెల్లడించాలో నాకు అర్థమవలేదు. వాడు చెప్పిన విషయాలన్నీ నెమరువేసుకున్నాను. వీళ్ల అదృష్టాదృష్టాల్ని భరించేందుకు భార్యల బాధ్యతకూడా వుందనే విషయం కొత్తగా కనిపించింది. వాడు ఇంకా ఎన్ని విధాలుగా నాకు రుజూచేసినా, అజాతకం బాపతు కీలకం యేమిటో నాకు అర్థమవదు. వాడు నమ్మిన యీవిషయాన్ని నేను నమ్మనూలేను. పూర్వాచారాలమీద వాడు చేసిన తీవ్ర విమర్శ, జ్యోతిషంమీద వాడుచూపే అపనమ్మకమూ, పిచ్చిపిచ్చి సిద్ధాంతాలమీదా, ఆచారాలమీదా, వాడు కనపరిచే అగౌరవమూ—అన్నీ ఏమయ్యేనై? పైకి ఏవిధంగానూ కనిపించకుండానే, ప్రభాకరం ఇంత మార్పుతో యీనాడు నాకు కనిపించటం ఆశ్చర్యమే అయింది.

వాడి నమ్మకాన్ని పోగొట్టగలిగేశక్తి నాలోలేదు. "నీకు అనుభవం లేదు" అనే వాదనను తీసుకొచ్చాడంటే నేను ఓడిపోతాను. ఇంకేవిధంగానూ వాణ్ణి ఒప్పించటంకూడా అసంభవం. ఇంకోరకం సమస్యయితే ఫరవాలేదు కాని, కేవలం నమ్మకం మీద ఆధారపడ్డదాన్ని పోగొట్టటం మాటలా? అయినా యీ సమస్యలో నేనెందుకు బాధపడాలి?

ఆ సంబంధాన్ని ఎంత వదులుకుందామన్నా, ఎందుకోగాని మనస్సు అటువైపే లాగుతుంది. ఆ దంపతులు నాకు కావలసిన వాళ్లవటమూ, వారు సౌఖ్యపడటమే నేను కోరేదవ

టమూ ఇందుకు కారణాలై ఉంటయ్యేమో ?

తరువాత లోపాయికారీగా కనుక్కుంటే— వీడు ఇంట్లో కూడా ఆమెను సరిగ్గా చూడడట ! చీటికీ మాటికీ ఆమె అంటే కసురుకుంటాడట. ఇంట్లోని మిగతావాళ్ళుకూడా ఇదే ధోరణట! ఆమెమాత్రం అన్నింటినీ భరిస్తూఊరుకుంటుందట !

ఇది మరీ వింతగా తోచింది. అందరూ నమ్మితే ఆమె గతేంకాను ? జీవితాంతం వరకూ కలిసి మెలిసి ఉండాల్సిన భార్యాభర్తల్లోనే యీ విభేదం వస్తే—ఇంక ఆ కాపరం సంగతి అడగనా ?

ఎంత చెప్పినా ప్రభాకరం వినేరకం మనిషి కాదని నాకు తెలుసు. ఐనా, ఇంటి విషయాల్లో మధ్య నేనెల్లా కల్పించుకొని యీ ఉరితాటిని మెడలో వేసుకొని, ముందు మా మిత్రత్వానికే స్వస్తి చెప్పుకోను ?

ఎంత ప్రయత్నించినా అది, మరపురాని విషయమైంది. ఇంత దుర్బలహృదయంతో తన బతుకు నంతట్నీ అదృష్టం మీద మోపి— ఆ బరువును ఒక్క వ్యక్తి భుజాలమీద మోపటంలో వీడి అభిప్రాయ మేమిటి ? ఏదో పిచ్చి కోపం వచ్చింది—కాని ఏం చెయ్యను ? ఎట్లా రుజూచెయ్యను ? కాలులో విరిగిన ముల్లులాగు కలుక్కులుక్కునే యీరకం విషయాన్ని ఎల్లా మరిచిపోను ?

## 2

ఒక సంవత్సరం గడిచింది; కాని ప్రభాకరం యేమీ మారి నట్టు కనిపించదు. రోజురోజుకూ వాడి ఆందోళన ఎక్కువౌ

తోంది.

ఒక మధ్యాహ్నం నాదగ్గరకు వచ్చాడు వాడి ముఖం మీదినవ్వు చూసేప్పటికే ఏదో మంచివార్త వచ్చిం దని గ్రహించాను.

"చూశావూ—ఆమెను కానుపుకు పంపాను; ఇటు సర్వీస్ కమీషన్ పరీక్షలో పాసయ్యాను. ఇదివరకు నువ్వు నమ్మ లేదు..." అని ఆకాగితాల్ని నాముందు పడేశాడు.

నే నేమీ మాట్లాడలేదు. మరొక వారానకల్లా వాడు ఉద్యోగంలోకి వెళ్ళిపోయాడు. ఈసిదర్శనాన్ని ఆధారంచేసు కొని, వీడికోసమని ఒక్కసారిగా నే నెల్లామారను?

మరొకనెల గడిచాక—అనుకోకుండా ఒక సాయంత్రం మళ్ళీ నాదగ్గరకు వచ్చాడు. వాడి ముఖంలో ఏభావమూ స్పష్టంగా లేదు.

"ఏమిటి విశేషం?" అన్నాను.

"మా ఆవిడ పోయింది" అన్నాడు.

"ఆఁ" అన్నాను ఆశ్చర్యపడుతూ.

ఆమెమృత్యువు వాణ్ని ఆందోళనపరచలేదు. చావసిద్ధమైన ముసలివాళ్లు పోతే కలిగే బాధకన్న ఎక్కువ బాధకు వాడు గురవలేదు. ఇష్టం లేని వ్యక్తి పోవటంవల్లనే వాడు లెక్కచెయ్యలేదేమో ?

"ఆమె పోయినందుకు నే నంత విచారించను... కాని..."

నేను వింటూ ఊరుకున్నాను.

"పాపిష్ఠిది ఊరకనే పోయిందీ? ఒక కొడుకునుకూడా నామెడకుచుట్టి మరీపోయింది."

అదా వీడి విచారం? బతికి ఉండి ఆమె వీడికి చేసిన హాని కన్న, చచ్చి చేసిన హానే ఎక్కువన్నమాట!

"నువ్వా విషయాన్నిగూర్చి బాధపడటం దేనికి ?"

"వాణ్ని ఎట్లా పెంచను ?"

"రెండో పెళ్ళి చేసుకో—" అని సలహా ఇచ్చాను.

"ఈ సత్రకాయ ఒకడుండె......పిల్లనిచ్చేవాడు దొరకొద్దూ?"

ఎవ రెట్లాపోయినా, మానవుడు స్వసౌఖ్యంకోసం పడే తిప్పల్ని, పాపం విప్పిచెప్పాడు. ఆమె వీడిపెళ్ళికే అటంకాన్ని సమకూర్చిపోయింది. ఏమైనా నాదృష్టిలో, ఆమె యీ దుర దృష్టానికి బాధ్యురాలవటంకన్న, పోవటంవల్లనే అదృష్టవంతురాలైంది.

"తరువాత ఆలోచించుకోవచ్చులే—" అన్నాను.

"అదే..." అని ఊరుకున్నాడు.

మరొక నెల గడిచాక ఇంకోచిత్రం జరిగింది. హఠాత్తుగా ప్రభాకరం మళ్ళీ నాదగ్గరకు వచ్చాడు, ఏదోతాజావార్తను తెచ్చిన విలేఖరిలాగు.

"ఏమిటి?" అన్నాను, వాడి ముఖంలోని తొందరను చూసి.

"మాబావమరిది పోయ్యాడు—" అన్నాడు, కనిపించీ కనిపించని నవ్వుతో.

నేను ఆశ్చర్యపోయ్యాను. పాపం, వాళ్ళకుటుంబానికి మిగిలిన ఒకక్కడూకూడా పోయ్యాడన్నమాట !

ఇక వీడిముఖం ఎందుకు తేటగావుందోకూడా నేను

ఊహించగలను. మామగారిది నలభై వేల రూపాయిల ఆస్తి వీడికి రాబోతోంది.

"సరే...మంచి అదృష్టవంతుడివే" అన్నాను.

వాడు ఒప్పుకున్నట్టు తల ఊపాడు. నాకు ఇంకో అనుమానం కూడా తీరలేదు.

"ఇంతకూ నీభార్య అదృష్టవంతురాలేనా?" అన్నాను.

ఈమాటతో వాడు సిగ్గుపడతాడనుకున్నాను. కాని మామూలు ధోరణిలోనే, "ఆమె దేముందిరా? అటు పుట్టింటికి కానుపుకని వెళ్ళిందో లేదో, వాళ్ళకు అరిష్టం వచ్చి—" అన్నాడు.

ఇంకేం — ఆమె చచ్చికూడా వీడిదృష్టిలో నష్టజాతకురాలే! వీడి నమ్మకంకూడా యీ జన్మలో తీరదు.

"సరే...నీ రెండో పెళ్ళిమాటేమిటి? ఈమధ్య ఎక్కడో సంబంధంకూడా కుదిరిందటే?" అన్నాను.

"కుదిరింది... కాని ఎట్లా చేసుకోను?"

"ఏం?"

"ఆస్తంతా కుర్రాడికేగా? నేను ఇంకోపెళ్ళి చేసుకొని ఆస్తితో ఎట్లా సంబంధం పెట్టుకోను? కుర్రాణ్ని కనిపెట్టి వుంటే మంచిఛాన్సు వుంటుంది గాని—"

నాకు ఒళ్ళు మండి, "అంతేలే...నువ్విప్పుడు పెళ్ళిచేసుకుంటే ఆ వచ్చే భార్య నిజంగా దురదృష్టాన్ని నీకోసం తీసుకొచ్చి, మీఇంట్లో దింపుతుంది." అన్నాను.

వాడు తెల్లముఖం వేసి, గట్టిగా ఊపిరిపీల్చాడు.

— ఏప్రిల్, 1942.

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

# మీ వినోదానికీ,

## విజ్ఞానానికీ —

# రూపవాణి

**(సినిమా మాసపత్రిక)**

చదవండి.

కథలు, నాటికలు, సినిమావ్యాసాలూ, నాట్యకళ మొదలైన అనేక శీర్షికలతో, వివిధ చిత్రాలతో వెలువడుతుంది.

మీ వ్యాపారాభివృద్ధికి యీ పత్రికద్వారా ప్రకటనలు చేసుకోండి.

విడిప్రతి 2 అణాలు

సంవత్సర చందా రూ 1-8-0

**ఇతర వివరాలకు :**

'రూపవాణి'

ఫ్రాన్సిస్ జోసెఫ్ వీధి,

జి. టి. మద్రాసు.